# పుణ్యతీర్థాలు

అయోధ్య: శ్రీరామచంద్రుడు పుట్టిన పుణ్యభూమి. న్యూఢిల్లీకి దాదాపు [illegible] కి.మీ. దూరంలో ఉత్తర ప్రదేశ్‌లో సరయూ నది ఒడ్డున ఉంది క్షేత్రం. అవధ్ జిల్లాలోని ఫైజాబాదుకు 6 కి.మీ. దూరంలోని 'తిరు అయోధ్య'ను రామజన్మ భూమిగా భావిస్తారు. ఇంకా అక్కడ హనుమాన్ టేక్రి (గుడి), నాగేశ్వర తీర్థం, ఇంద్ర తీర్థం, అమ్మాజీ మందిర్ [illegible] పుష్కరిణి చూడాల్సిన ప్రదేశాలు. దేశంలోని జిల్లా ప్రధాన నగరాల నుంచి అయోధ్యను కలుపుతూ రైలుమార్గాలు ఉన్నాయి.

కాశీ: చరిత్రకందని అత్యంత పురాతన నగరం. మహా శ్మశానం. వారణాసి. గంగకు ఉపనదులైన వారుణ, అసి ఇక్కడ సంగమించే చోటు కాబట్టి దీనికి వారణాసి అనే పేరు వచ్చింది. కాశీ జ్యోతిర్లింగ క్షేత్రం. ఇక్కడ అమ్మవారు అష్టాదశపీఠాల్లో ఒకరైన విశాలాక్షిగా వెలుగొందుతోంది. మహాశివుడు విశ్వనాథుడుగా భక్తుల పూజలందుకుంటున్నారు. అన్నపూర్ణాదేవి, విశాలాక్షమ్మ ఆలయాలూ కాలభైరవుడి గుడి, తిలాభాండేశ్వరుని ఆలయం గౌడీ భాయి (విశ్వేశ్వరుడి చెల్లెలు) గుడి, వారాహి (కాశీ రక్షకురాలు), తులసీ మానస మందిరం, సంకట మోచనాలయం, దుర్గామందిరం, దండపాణి (సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయం), బిందు మాధవుడి గుడి, కేదార మందిరం, కాశీరాజు కోట, అక్కడికి సమీపంలోనే ఉన్న సారనాథ్... చూడాల్సిన ప్రదేశాలు.

ద్వారక : కృష్ణుడు ఏలిన పురం ఇది. సముద్ర మట్టానికి సమతలంగా ఉండే ద్వారక పట్టణం ఇప్పటికీ ఆరుసార్లు సముద్రంలో మునిగిపోయిందని ఇప్పుడున్నది ఏడోసారి నిర్మించిన ద్వారక అని అంటారు. గుజరాత్‌లో జామ్‌నగర్ జిల్లాలో ఉన్న ద్వారక సమీపంలోనే నాగేశ్వర జ్యోతిర్లింగం కొలువై ఉంది. బ్రహ్మకుండం, బేటద్వారక ఇక్కడ చూడదగ్గ ఇతర ప్రదేశాలు.

మధుర : కృష్ణుడు జన్మించిన పుణ్యభూమి. ఢిల్లీ నుంచి దాదాపు 150 కి.మీ. దూరంలో ఉంది పుణ్యక్షేత్రం. శ్రీకృష్ణ జన్మస్థానంగా భావించే చెరసాల ఉన్నచోట ప్రస్తుతం కేశవాలయం కనిపిస్తుంది. ఇక్కడే ద్వారకాధీశుడి గుడి చూసి తీరాల్సిందే. మధుర కేంద్ర స్థానంగా చుట్టు పక్కల ఎన్నో చారిత్రక ప్రదేశాలున్నాయి. అవి. నందుడింట చిన్ని కృష్ణుడు ఆడి పాడిన గోకులం, గోపికలతో రాసలీలలు సాగించిన బృందావనం. గోవర్ధనగిరి, కంసుని కోట మొదలైనవి.

గురువాయూరు : తెలుగు వారికి తిరుమల ఎలాగో మలయాళీలకు గురువాయూరు అలా. గురువాయూరు నారాయణ క్షేత్రం. కేరళలోని త్రిశూర్ జిల్లాలో గురువాయూరప్ప కొలువై

ఉన్నాడు. 1970 నవంబరు 30న గురువాయూరప్ప ఆలయంలో మంటలు చెలరేగాయి. ఐదు గంటల పాటు మంటలు మండుతూనే ఉన్నా శ్రీ కోవిల్ (గర్భగుడి) దాకా రాకపోవడం స్వామి లీలేనని భావిస్తారు భక్తులు. ఈ దుర్ఘటనలో గురువాయురప్ప విగ్రహం, గణపతి, భగవతి ఆలయాలు తప్ప సర్వం ఆహుతైపోయాయి. 1973 ఏప్రిల్ 14న ఆలయాన్ని పునరుద్ధరించారు. ఇక్కడి విగ్రహం 'పాతాళ అంజనం' అనే అరుదైన ఏకశిలా సాలగ్రామ రూపమని అంటారు. త్రిశూర్ దాకా రోడ్డు, రైలు మార్గాల్లో వెళ్లొచ్చు. అక్కణ్నుంచి గురువాయూరు 28 కి.మీ. దూరం. సమీప విమానాశ్రయం కొచ్చిన్ (79 కి.మీ.)

శ్రీరంగం : సుప్రసిద్ధ 108 దివ్య క్షేత్రాల్లో మొట్టమొదటి పుణ్యక్షేత్రం శ్రీరంగం తమిళనాడులో ఉంది. విష్ణుమూర్తి ఇక్కడ రంగనాథుడి రూపంలో కొలువై ఉన్నాడు. 156 ఎకరాల విస్తీర్ణంలో దాదాపు 10,710 అడుగుల వైశాల్యంలో కొలువై ఉన్న శ్రీరంగం ఆలయం భారతదేశంలోనే అతి పెద్దది. కంబోడియాలోని మూతబడిన అంగ్ కోర్ వాట్‌ను మినహాయిస్తే ప్రపంచంలోనే అతి పెద్ద హిందూ ధామంగా చెప్పుకోవచ్చు. 21 గోపురాలూ ఏడు ప్రాకారాల వైశాల్యం కలిపితే 32,592 అడుగుల విస్తీర్ణంలో అలరారే శ్రీరంగం ఆలయాన్ని చూడటానికి రెండు కళ్లూ చాలవు. రంగనాథుడి గుడి కాకుండా ఆలయ ప్రాంగణంలో [illegible] కోట్ల ఆలయాలు ఉంటాయి. అన్నీ విష్ణుమూర్తి అవతారాలకు సంబంధించినవే. ఇక్కడ అమ్మవారు రంగనాయకి. చెన్నై నుంచి రైలు, రోడ్డు మార్గాల ద్వారా తేలిగ్గా శ్రీరంగం చేరుకోవచ్చు. శ్రీరంగానికి సమీప విమానాశ్రయం తిరుచిరాపల్లి 10. కి.మీ.

కంచి : చెన్నైకి 70 కి.మీ. దూరంలో చెంగల్పట్టు జిల్లాలో ఉంది క్షేత్రం. శక్తిత్రయంలో ఒకటైన కామాక్షి అమ్మవారు ఇక్కడ కొలువై ఉంది. కాంచీపురాన్ని 'గోల్డెన్ సిటీ ఆఫ్ టెంపుల్స్' అని పిలుస్తారు. పంచభూత లింగాలలో ఒకటైన భూలింగం. ఏకాంబరేశ్వరుడుగా శివుడు ఇక్కడ పూజలందుకుంటున్నాడు. ఇంకా... వరదరాజ స్వామి ఆలయం, కైలాస నాథాలయం, కుమార కొట్టం ప్రసిద్ధి పొందిన దేవాలయాలు.

మధురై : దక్షిణ భారతదేశంలోని అత్యంత పురాతన నగరాల్లో ఒకటైన మధురై మీనాక్షిదేవి కొలువై ఉన్న పుణ్యస్థలి. మహాశివుడు ఇక్కడ సుందరేశ్వరుడుగా కొలువుదీరాడు. 12 గోపురాలతో అలరారే మధురై ఆలయాన్ని చూసేందుకు ఎక్కడెక్కడి నుంచో విదేశీయులు సైతం తరలి వస్తారు. చెన్నై నగరానికి 472 కి.మీ. దూరంలో ఉన్న మధురైలో డొమెస్టిక్ విమానాశ్రయం ఉంది. దక్షిణ భారతదేశంలోని అన్ని ప్రధాన నగరాలనుంచి రైలు మార్గాలు ఉన్నాయి. తమిళనాడులోని అన్ని ముఖ్యపట్టణాల నుంచి బస్సుల్లో వెళ్లొచ్చు.

- కె. మంజువాణి, అక్కయ్యపాలెం



# శాస్తి

నాంచారమ్మ పరమ పిసినారి. ఇంట్లో పాచి పని చేసే పని మనిషికి కూడా పట్టెడన్నం పెట్టడానికి ఆమెకు ససేమిరా చేతులు రావు.

ఒకరోజు అంట్లగిన్నెలు తోముకుంటూ చిరాకుపడుతున్న భార్య వంక జాలిగా చూసి, "ఇవాళ పెద్దమ్మ రాలేదా?" అడిగాడు జగన్నాథం.

"దానికి జీతం చాలదట! మరో పది వేయాలట. పైసా కూడా పెంచనని ఖండితంగా చెప్పేసాను. కోపంగా వెళ్ళి పోయింది." అంది నాంచారమ్మ.

"రోజు రోజుకీ ధరలు మండిపోతున్నాయి. దాని అవసరాల కొద్దీ జీతం పెంచమంది. అంత మాత్రానికే పొమ్మంటే, ఎలా చెప్పు? ఇంటెడు చాకిరీ నువ్వొక్కర్తివే చేసుకోగలవా?" సానుభూతి కురిపించాడు జగన్నాథం.

"బావున్నాయండీ మీ మాటలు! మీకు డబ్బు విలువ ఏమీ తెలిసినట్టు లేదు. అది అడిగిందని జీతం పెంచుకుంటూ పోతే, అది అడుగుతూనే ఉంటుంది. మనం ఇస్తూనే ఉండాలి. చివరికి దానికి కొమ్ములు, మన చేతికి చిప్ప రావడం ఖాయం!"

భార్య మాటలకు మరి నోరెత్తకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు జగన్నాథం.

మధ్యాహ్నం పదకొండయింది. భోజనం చేసి ఆఫీసు కెళ్ళిపోయాడు జగన్నాథం.

"అమ్మా! పిడికెడు మెతుకులుంటే పడేయుం దమ్మా, కడుపు మండిపోతోంది!" అంటూ గుమ్మం ముందు దీనంగా నిలబడి చిప్పమొత్తుకుంటున్న స్త్రీని చూసి, "ఈవేళప్పుడు ముష్టేమిటే. ముందు కెళ్ళు చూడటానికి పిడుకుచ్చులాగున్నావ్. అడుక్కోకపోతే, ఏదో పని చేసుకోకూడదూ?" అంటూ కసురుకుంది నాంచారమ్మ.

దూరి వెంకటరావు, ఎమ్.ఎ., బి.యస్.సి, బి.ఇడి., విజయనగరం

ఆ పుణ్యమేదో మీరే కట్టుకుని, నాకేదైనా పని ఇప్పించండి, నాకు వెనకా ముందు ఎవ్వరూ లేరు. మీ ఇంట్లో పని చేసుకుంటూ, మీ కాళ్ళకాడ పడుంటా!" అన్నది ఆ అనాథ.

"సరే. ఇవాళ్టి నుండి మా ఇంట్లో పాచి పని చెయ్యి. రెండు పూటలా నీకిన్ని మెతుకులు పడేస్తాను. గిన్నెలు తోమడమే కాదు, బట్టలు కూడా ఉతకాలి. జీతం లాంటిదేమీ ఉండదు. ఇష్టమైతే ఇవాళే పనిలో చేరు" అంది నాంచారమ్మ.

సాయంత్రం ఆఫీసు నుండి వచ్చిన జగన్నాథం సంగతి తెలుసుకుని, "కొత్తవారిని నమ్మవద్దు. సమయం దొరికితే మనకళ్ళు కప్పి, ఇంట్లో సామానులు దోచుకుంటారు." అని భార్యని హెచ్చరించాడు.

కానీ నాంచారమ్మ భర్త మాటని లెక్క చేయలేదు.

పగలంతా పుట్టెడు చాకిరి చేస్తూ, రాత్రిళ్ళు గుమ్మం ముందు పడుకునేది పిచ్చిగత్తె.

ఒకరోజు ఆలస్యంగా లేచిన నాంచారమ్మ వీధి తలుపులు తెరచి ఉండటం గమనించి గతుక్కుమంది. వెంటనే పనిమనిషిని కేకేసింది. ఆమె జాడలేదు.

ఇంట్లో స్టీలు గిన్నెలు కనబడక పోగా, లబో దిబో మంటూ రాగం అందుకుంది.

పరిస్థితి అర్థమైపోయింది- జగన్నాథానికి.

"ఎప్పటి నుంచో నమ్మకంగా పనిచేస్తున్న ఆ ముసల్ది పది రూపాయలు జీతం పెంచమందని కనికరం లేకుండా పొమ్మన్నావు. చవకగా కుదిరిందని ముక్కూ - మొహమూ తెలియని దాన్ని పనిలో పెట్టుకుని, ఉన్నదంతా పోగొట్టుకున్నావ్. నీకు తగిన శాస్తి జరిగింది." అన్నాడు జగన్నాథం.

భర్త మాటలకు మతిపోయింది పాపం నాంచారమ్మకి. తన పిసినారి తనం వల్ల విలువైన వస్తువుల్ని పోగొట్టుకున్నాననుకుంది. ఆ రోజు లగాయితూ ఆమెలో మార్పు రావడం గమనించాడు జగన్నాథం.






# ట్రాఫిక్ పోలీస్

పోలీసు రంగయ్యంటే గుడివాడలో తెలియని వారుండరు. రూల్సు విషయంలో ఎంతో కఠినంగా ఉన్నా, అతని మనసు మెత్తన గావడంతో ప్రజలలో అధిక సంఖ్యాకులు అతనంటే అభిమానపడతారు. నిబంధనల నతిక్రమించే వారి విషయంలో చిన్నా - పెద్దా తారతమ్యం లేకుండా మందలించి, దారిలో పెట్టడం అతని అలవాటు.

ఆరోజు రద్దీ విపరీతంగా ఉంది. రంగయ్య సెంటర్లో నిలబడి ట్రాఫిక్ కంట్రోలు చేస్తున్నాడు. మిట్ట మధ్యాహ్నం సమయంలో ఎండలో నురగలు గ్రక్కుకుంటూ - రిక్షాల్లో ఇనుప ఊచలు వేసుకొని ఇద్దరు రిక్షావాళ్ళు వస్తున్నారు. వాళ్ళను చూస్తే రంగయ్య హృదయం ద్రవించింది. అప్పుడే ఆగకుండా మోటార్ బైక్ హారన్ మోత వినవస్తుండటంతో ఉలిక్కిపడి అటు చూసాడు రంగయ్య. కొత్తగా వచ్చిన డి.యస్.పి. కొడుకు విపరీతమైన వేగంతో దూసుకొస్తున్నాడు. అదే ఆ హారను మోతకు కారణం దాని అర్థం కూడా అతనికి తెలుసు. మిగతా వాహనాల్ని వేటినైనా సరే ఆపి అతన్ని పంపించాలని. కాని, ఆ లోపుగా రిక్షాల నాపితే, అవి పల్లంలోకి జారిపోయే ప్రమాదం ఉంది. వాటిని ఆ రిక్షాల వాళ్ళు పట్టి ఆపలేరని అతనికి తెల్సు. ఒక్కక్షణంలోనే ఓ నిర్ణయాని కొచ్చాడు రంగయ్య. 'స్టాప్' బోర్డ్ ప్రత్యక్షమయింది. అతని చేతిలో - కీచుమంటూ ఆగింది మోటార్ బైక్. "ఏమోయ్ ఇటురా!" దర్పంగా పిలిచాడు మోటార్ బైక్‌పై వున్న కుర్రాడు.

వినయంగా అతని దగ్గరకు నడిచాడు రంగయ్య.

"నే నెవరో తెల్సా?" రౌద్రంగా అడిగాడు.

"యస్సార్" వినయంగా అన్నాడు రంగయ్య.

"తెలుసన్నమాట? తెలిసే నన్ను ఆపేటంతటి

ఎ. విజయ, రాజమండ్రి

ధైర్యం చేసావన్నమాట!"

"మిమ్మల్ని ఆపాలని ఆపలేదయ్యా, బాబూ! ఆ రిక్షావాళ్లను ఆపేస్తే పల్లంలోకి జారిపోతారు" వినయంగా అన్నాడు రంగయ్య.

"ఓహో! రిక్షావాళ్ల కోసం నన్నాపావన్న మాట! అంతేనా?" వ్యంగ్యంగా అన్నాడతను.

"రూల్స్ అందరికీ ఒకటేగదయ్యా! అంత స్పీడు ప్రమాదమండయ్యా!"

"నాకు నువ్వేం చెప్పనక్కర్లేదు – శ్రీరంగ నీతులు! ఏమ్మేం చేయాలో నాకు తెల్సు" టక్కున కిక్కు కొట్టి వెళ్లిపోయాడతను.

ఖిన్నుడయ్యాడు రంగయ్య.

మర్నాడే డి.యస్.పి ఇంటిముందు సెంట్రీగా పోస్టయ్యాడు రంగయ్య.

సాయంత్రం డి.యస్.పి. గారి అబ్బాయికి యాక్సిడెంటయి నర్సింగ్‌హోంలో ఉన్నాడన్న వార్త రావడంతో డి.యస్.పి.గారి ఇంట్లో పనిచేసే పోలీసు బలగమంతా పరామర్శించడానికి నర్సింగ్ హోంకి వెళ్లారు.

తలకు, పంటికి బ్యాండేజీతో నీరసంగా పడుకున్నాడు బెడ్‌పై ఆ అబ్బాయి. రంగయ్యను గుర్తుపట్టి దగ్గరకు పిలిచాడు.

"నీ పేరు రంగయ్య కదూ! అయామ్ వెరీ సారీ! నువ్వు చెప్పిన మాట సత్యమే! అప్పుడే నీ మాట విన్నట్లయితే, ఈ ప్రమాదమే జరగకపోను. ట్రాఫిక్ నిబంధనలు అందరికోసం"- అన్న నీ మాట విననందుకు తగిన శాస్తి జరిగింది. నీలాంటి మంచి వ్యక్తి మా ఇంటి ముందు సెంట్రీగా వుండడం కన్నా, సెంటర్లో నిలబడి ట్రాఫిక్ కంట్రోలు చేస్తే, నలుగురికి మేలు చేసినవాడివిగా వుంటావు. నిన్ను ఈ రోజే అక్కడికి పంపే ఏర్పాటు చేస్తాను." నాకు అంటూ క్షమాపణ వేడుకున్నాడు రంగయ్యను. తరువాత తండ్రితో ఏదో మాట్లాడాడు. మరునాడు నుంచి రంగయ్య మరల ట్రాఫిక్ పోలీస్‌గా తన బాధ్యతను నిర్వర్తించసాగాడు సంతృప్తిగా!



# గుడ్డు పెట్టినా పాలిచ్చే వింతప్రాణి - ఎకిడ్నా

గుడ్డుపెట్టి సంతానం కన్నా, తన పిల్లలకు పాలిచ్చే జంతువులు ప్రపంచంలో రెండే వున్నాయి. ఒక దాని పేరు ఎకిడ్నా, మరొకదాని పేరు ప్లాటిపస్. ఎకిడ్నా వివరాలు తెలుసుకుందాం.

12 కోట్ల సంవత్సరాల నుండి మనుగడ సాగిస్తున్న అతి పురాతన జీవి ఎకిడ్నా ఆస్ట్రేలియాలో న్యూగినీ అడవి ప్రాంతాలలో తిరుగుతుంటుంది. అక్కడి ప్రజలకు దీని మాంసం అంటే చాలా ఇష్టం. అందువల్ల వీటిని ఎడాపెడా వేటాడి చంపేస్తున్నారు. వీటి సంఖ్య అంతరించిపోయే దశకు చేరబోతున్నది. ఆయా దేశాలు వీటి విలువ గుర్తించి ఈ జాతిని కాపాడుకోవడానికి కృషి చేస్తున్నారు.

ఎకిడ్నాకి చిన్న పాదాలుంటాయి ముందు పాదం బాగా బలంగా వుంటుంది. పాదాలతో గోతులు తవ్వుతుంది. బలమైన పాదాన్ని నేలలో గుచ్చి ఇంకో పాదంతో మట్టిని సునాయాసంగా తవ్వేస్తుంది. దాని శత్రువేదైనా ఎదురైతే తన ముఖం, పాదాలు లోపలికి దాచుకుని బంతిలా గుండ్రంగా తయారై శత్రువును ఏమార్చి దొర్లుకుంటూ తప్పించుకుని పారిపోతుంది. ఇంకో విషయం కూడా ఎకిడ్నాలో మనం గమనించవచ్చు! దీనికసలు నోట్లో పళ్లేవుండవు. దాని నాలుకకు జిగురులాంటి పదార్థం అంటుకుని వుంటుంది. చీమలు, చెదపురుగులు ఎక్కువగా వున్న చోట ఈ ఎకిడ్నా తన నాలుకని బారచాపుతుంది. చీమలు, చెదలు దా నాలుకమీద అంటుకుపోతాయి. ఇంకేం! మజామజాగా చప్పరించేస్తుంది. పెద్దగా ఎదిగిన ఎకిడ్నా తొమ్మిది కిలోల బరువుంటుంది. 30 సంవత్సరాలు బ్రతుకుతుంది. ఇది నీటిలోనూ వేగంగా ఈదుతుంది.

ఆడ ఎకిడ్నా సంవత్సరానికి ఒకే ఒక గుడ్డు పెడుతుంది. ద్రాక్షపండంత చిన్నగా వుండే ఆ గుడ్డును కంగారూల కున్నట్లే వుండే పొట్టలోని సంచిలో పొదుగుతుంది. 10 రోజులు అలా పొదిగాక రెండు సెంటీమీటర్ల పొడవుండే పిల్ల ఎకిడ్నా బయటికొస్తుంది. ఆ సంచిలోనే వుండే ప్రత్యేక గ్రంధుల ద్వారా ఆ పిల్ల పాలు తాగుతుంది. తల్లి సంచిలో ఆ పిల్ల ఎకిడ్నా 55 రోజులుంటుంది. తర్వాత తల్లి దీనిని బయటకుతీసి నేలపై గోయి తీసి అందులో వుంచుతుంది. 10 రోజుల కొకసారి వచ్చి ఆహారం తినిపిస్తుంది. ఇలా ఏడునెలలు సాకుతుంది తల్లి ఎకిడ్నా.

-బి. సాయిసుకుమార్, హైదరాబాద్



# వింత చట్టం

పూర్వం విచిత్రపురమనే రాజ్యాన్ని, చిత్ర సేనుడనే రాజు పాలించేవాడు. ఆయనకు మల్లయుద్ధమంటే చాలా ప్రీతి. ఆయన ఆస్థానంలో ఎంతోమంది మల్లయుద్ధ వీరు లుండేవారు. వారి పోషణ బాధ్యత అంతా రాజే చూసేవాడు. వారికి నిత్యం పౌష్టికా హారాన్ని సమకూరించి, వారికి సకల సౌకర్యాలు కల్పించాడు. ఆ రాజ్యంలో తరచు మల్లయుద్ధ పోటీలు జరుగుతూండేవి.

చిత్రసేనుని కొలువులో రణమల్లు అనే మల్లయుద్ధ వీరుడు ఉండేవాడు. వాడు కడు బలశాలి. వాడు పొరుగు రాజ్యాల మల్లయుద్ధ వీరులతో పోరాడి, వాళ్లను చిత్తుచేసి, ఎన్నో బహుమతులను గెల్చుకున్నాడు. రణమల్లు పేరు చెబితే, ఏ మల్లుడు యుద్ధానికి సిద్ధపడేవాడు కాదు. అతని వల్ల విచిత్ర సామ్రాజ్యానికి ఎంతో ఖ్యాతి లభించింది.

రణమల్లు రాజును ఒక కోరిక కోరాడు. అతని కోరిక మేరకు రాజు ఆ రాజ్యంలో ఒక వింత నియమాన్ని ప్రవేశపెట్టి దాన్ని చట్టంగా మార్చాడు. ఆ దేశ పౌరులెవరైనా వారి మీసాలపై చెయ్యివేసి, రణమల్లు కంట పడ్డారంటే, వాళ్ళు రణమల్లుతో మల్లయుద్ధం చెయ్యాలి. ఆ చట్టానికి భయపడి, ఆ దేశ పౌరులు, వారి వారి మూతులపై మీసాలను తొలగించుకున్నారు. రాజు, మంత్రి, సేనానికి తప్ప మిగతావారంతా, వారి వారి మీసాలను తొలగించుకుని, షేవ్ మూతులు చేసేసు కున్నారు.

ఆ రాజ్యంలో నివసించే రంగిశెట్టి, తన కుమార్తెను ప్రక్కరాజ్యంలో నివసించే, గంగిశెట్టి కుమారుడు, పోలిశెట్టికిచ్చి వివాహం చేసాడు.

దొడ్డిపట్ల పూర్ణిమ, హైదరాబాదు



పోలిశెట్టి, అత్తవారింటికి విచిత్రపురానికి వచ్చాడు. అతని మూతిపై మీసాలున్నాయి. అతనికి ఆదేశ చట్టం గురించి తెలియదు. అతడు ఒక రోజు, భోజనం చేసి, ఇంటిబైట కొచ్చి, చేతులు మూతి కడుగుకొని, తన మీసాలను సాఫు చేసుకుంటూ, వీధివెంట వెళ్తే రణమల్లు కంటపడ్డాడు. రణమల్లు వెళ్లి రాజుగార్కి ఫిర్యాదు చేసాడు. రాజు పోలిశెట్టికి కబురు పంపి అతన్ని సభకు రప్పించాడు. పోలిశెట్టి వచ్చి సభలో ముద్దాయి స్థానంలో నిలబడ్డాడు.

రాజు పోలిశెట్టిని చూసి, "నీవు మా రణమల్లుని చూసి, మీసం ఉన్నాక కాబట్టి, మాదేశ చట్ట ప్రకారం నీవు మా రణమల్లుతో యుద్ధం చెయ్యాలి" అన్నాడు. రణమల్లుని చూసి పోలిశెట్టి భీతిల్లిపోయాడు.

"అయ్యా, నేను మీ పొరుగుదేశ పౌరుణ్ణి. నాకు ఈ దేశ చట్టాలు గురించి తెలియదు. పైగా మీ మల్లయోధులు మంచి పౌష్టికాహారం తింటూ రోజూ తర్ఫీదు పొందుతూ చాల బలంగా ఉన్నారు. నేనా వైశ్యుణ్ణి, బక్కచిక్కిన వాణ్ణి. మీ రణమల్లునితో ఎలా పోరాడ గలను?" అని పోలిశెట్టి రాజుతో విన్నవించు కున్నాడు.

"ఏది ఏమైనా గాని, మాదేశ చట్ట ప్రకారం నీవు మా రణమల్లుతో, మల్లయుద్ధం చేయవలసిందే.!" అని రాజు ఖండితంగా చెప్పేశాడు. బిక్కమొహం పెట్టిన పోలిశెట్టిని చూసి, రాజు కనికరించి ఇలా అన్నాడు. "చూడు పోలిశెట్టి, కావాలంటే, నీవు కూడా ఆరునెలలు పాటు మంచి ఆహారం తిని, తర్ఫీదు పొందు. అందుకు తగిన ఏర్పాట్లు నేను చేస్తాను" అన్నాడు.

ఆరునెలల తరువాతనే రణమల్లుతో యుద్ధం చేద్దువుగాని. ఈ ఆరునెలలు నీకు అయ్యే ఖర్చంతా నేనే భరిస్తాను" అని, నచ్చచెప్పాడు.

పోలిశెట్టి విధిలేక సరేనని ఒప్పుకున్నాడు. పోలిశెట్టి రాజుగారు పంపే పైకంతో, రోజూ బాదం, పిస్తా, జీడిపప్పు మొదలైన బలమైన

రుచికరమైన ఆహారం తింటూ, రోజుకో పిండివంట చేయించుకుని, భుజిస్తూ, హాయిగా భార్యతో ఆనందంగా గడపసాగాడు.

రణమల్లుకు, పోలిశెట్టికి, యుద్ధం జరిగే రోజు నిర్ణయం అయిపోయింది. ఇంకేముంది రణమల్లుని తలుచుకుంటేనే పోలిశెట్టికి జ్వరం వచ్చినంత పనైంది. హాయిగా రోజుకో పిండి వంట తింటూ భార్యతో ఆనందంగా ఉంటున్న నన్ను ఇలా బలిపశువును చేశారు. ఆ రణమల్లు బలం ధాటికి తట్టుకోలేక ఎంతోమంది చిత్తైపోయారో! ఇక నేనెంత. ఎలాగైనా ఈ ఆపద నుండి తప్పించుకోవాలి అనుకున్నాడు.

సరిగ్గా మల్ల యుద్ధం జరగడానికి నిర్ణయించిన సమయానికి రణమల్లు యుద్ధ ప్రాంగణంలోకి చేరుకున్నాడు. మహారాజు, మహామంత్రియే కాక దేశపౌరులు కూడ తండోపతండాలుగా, మల్లయుద్ధం చూసేందుకు తరలి వచ్చారు. యుద్ధ ప్రాంగణంలో రణమల్లు ఎగురుతూ తొడలు చరుస్తూ ఉంటే, కంచు మ్రోగినంత శబ్దం వినపడసాగింది.

తరువాత పోలిశెట్టి బరిలోకి వచ్చి రణమల్లుని ఎదురుగా నిలబడ్డాడు. కాని పోలిశెట్టి మూతిమీద మీసాలు లేవు. వాటిని పూర్తిగా గొరిగించుకుని, బోడిమూతితో వచ్చాడు. "మూతిమీద మీసంలేని, ఈ వ్యక్తితో నేను యుద్ధం చేయను" అని రణమల్లు వెనుదిరిగి వెళ్ళిపోయాడు. ఇంకేముంది పోటీ నిలిచిపోయింది. ఎవరింటికి వారు వెళ్ళిపోయారు. పోలిశెట్టి, తన యుక్తి పారినందుకు ఆనందించి, బ్రతుకు జీవుడా అని ఆనందపడ్డాడు. ఆరునెలల పాటు రాజుగారి సొమ్ము అప్పనంగా తిని, పోలిశెట్టి తెలివిగా ఆపదనుండి బయటపడ్డాడు.

"తెలివి ఉంటే, తల కాస్తుంది" అంటే ఇదేనేమో.



# గబ్బిలాల గుహ

ప్రపంచంలో ఏడు వింతలు ఇంతకు క్రితం ఒకలా వుంటే, 2008 సంవత్సరంలో లెక్కించిన దానిప్రకారం మరో ఏడు వింతలుగా గుర్తించబడ్డాయి. ఈ వింతలే కాక లెక్కలోకి రాని వింతలు ఈ ప్రపంచం అంతా కోకొల్లలు. అందులో ఒకటి గబ్బిలాల గుహ అనే దాని గురించి ముచ్చటించుకుందాం!

'గబ్బిలాల గుహ' వింత ఏమిటి? గబ్బిలాలు సాధారణంగా చీకట్లోనే నివసిస్తాయి. గుహలు చీకటిగా వుంటాయి గనుక అందులో గబ్బిలాలు చేరి వుండవచ్చు. అంత మాత్రానికే 'గబ్బిలాల గుహ' వింతగా చెప్పుకోవడం ఏమిటి అన్న అనుమానమందరికీ రావచ్చు.

అమెరికాలోని టెక్సాస్ దగ్గర బ్రాకెన్ కేవ్ అనే గుహ వుంది. ప్రతి వేసవికాలం సాయంత్రం పూట ఇరవయి లక్షల గబ్బిలాలు మామూలు గబ్బిలాల వలె కాక వర్ణంతా రొమ్ముల్లో ప్రత్యేకంగా వుంటాయి. వీటిని ఫ్రీటెయిల్డ్ బ్యాట్ అని అంటారు. మెక్సికన్ నగరానికి చెందిన ఈ ఇరవై లక్షల గబ్బిలాలు చలి ముదిరినప్పుడు మెక్సికో రాష్ట్రంలోనే 1600 కిలోమీటర్ల దూరంలోని ఈ గుహలోనే ఒక చదరపు మీటరు స్థలంలో 500 వరకు వేలాడుతుంటాయి. అంతగా కిక్కిరిసిపోయి వున్న ఈ పిల్ల గబ్బిలాలకు తల్లి గబ్బిలాలు ఆహారం వెతికి తెచ్చి తినిపిస్తాయి. ప్రతి తల్లి గబ్బిలం తన పిల్లకే ఏమాత్రం పొరపాటు లేకుండా ఆహారం తినిపిస్తుంది. ఈ 20 లక్షల గబ్బిలాలు ఈ గుహ నుండి బయటకు రావడానికే 3 గంటల సమయం పడుతుందట! ఇన్ని లక్షల గబ్బిలాల రెట్టలతో గుహలోని అడుగు భాగం కొన్ని మీటర్ల మందం నిండిపోతుంది. ఆ మలాన్ని తినడానికి రకరకాల కీటకాలు వస్తాయి. ఈ కీటకాలన్నీ సాధారణంగా పైర్లను నాశనం చేసేవే! గబ్బిలాలు వీటిని టన్నుల కొద్దీ తినేస్తాయి. అలా ఈ ప్రాంతంలోని పంటలకు తద్వారా ప్రజలకు ఎనలేని మేలు జరుగుతుంది. అందువలన అక్కడి ప్రజలకు ఈ గబ్బిలాలంటే ఎంతో ప్రేమ. పొరపాటున కూడా వీటికి హాని తలపెట్టరు.

ఈ మెక్సికన్ గబ్బిలాలు గంటకు 97 కిలోమీటర్లు ప్రయాణించగలవు. 10000 అడుగుల ఎత్తువరకు ఎగరగలవు. 20 లక్షల గబ్బిలాలు నివసించే 'బ్రాకెన్‌కేవ్' నిజంగా లెక్కించని ప్రపంచ వింతగా ఒప్పుకుంటారా మరి!

– టి. ప్రభాకర్‌రావు, హైదరాబాద్




బి.వి. రాజశ్రీ

7 రాకుమారి నవ్వుతూ, "మీరు ఆ కోతి మొఖంగాడి గురించి భయపడకండి. నావద్దనుండి ఆ విసనకర్రని ఎవరూ తీసుకువెళ్ళలేరు" అంది. "అయితే దాన్ని ఎక్కడ దాచావు" అని మాయ మియాన్‌కాంగ్ అడగడంతో, రాకుమారి తన నోట్లో నుండి చిన్న గురుగింజంత విసనకర్రను బయటకి తీసి గాలిలో ఆడించింది. అది పెద్ద విసనకర్రగా మారిపోయింది.

దాన్ని చూసిన మియాన్‌కాంగ్, "నాకు ఇన్ని రోజులు దీని గురించి సరిగ్గా తెలియలేదు. ఆ కోతిగాడి వలన దీని వివరాలు తెలుసుకోవాలని ఆశగా వుంది. దీన్ని మరలా చిన్నగా ఎలా మార్చాలి" అని అడిగాడు. అందుకు రాకుమారి "మీకు అన్నీ తెలిసీ ఈ రోజు వింతగా అడుగుతున్నారు. మీ తలకు ఏదైనా దెబ్బ తగిలిందా" అంటూ అతని తలను బాగా గమనించింది. "లేదు. నాకు దెబ్బ తగలలేదు. ముందు నేను అడిగిన దానికి సమాధానం చెప్పు" అంటూ పైకి లేచాడు మియాన్‌కాంగ్.



మీరు ఆరోగ్యంగా వుంటే అంతే చాలు. మీకు మరలా చెబుతాను. ఈ విసనకర్రని ఇటు నుండి అటువైపు వూపితే చిన్నదిగా మారుతుంది. , అటునుండి ఇటు వూపితే పెద్దదిగా మారుతుంది. దీన్ని ఎంత పెద్దదిగానైనా చేసుకోవచ్చు" అంది. "ఏదీ దాన్ని నాకు ఇవ్వు" అంటూ వాంగ్ దాన్ని తీసుకుని వూపాడు. మరుక్షణం అది గురిగింజంత చిన్నదిగా మారిపోయింది. వెంటనే దాన్ని నోటిలో వేసుకుని మింగేసాడు.

అది చూసి రాకుమారి "అయ్యో! దాన్ని మీరు మింగారేం?" అంది. మరుక్షణం షియాన్ కాంగ్ వాంగ్‌లా మారిపోయాడు. అది గమనించి రాకుమారి ఆశ్చర్యపోయింది. వాంగ్ తన భర్త రూపంలో వచ్చి తనను మోసంచేసి విసనకర్రని తీసుకుపోతాడని ఆమె కలలో కూడా అనుకోలేదు. "మోసం.. దగా.. ఈ కోతిగాడిని పట్టండి. బంధించండి" అని పిచ్చిగా గంతులు వేయసాగింది. వాంగ్ వేగంగా





పారిపోయాడు. రాకుమారి అరుస్తూ స్పృహతప్పి కిందపడిపోయింది.

వాంగ్ ఆ గుహనుండి బయటకు వచ్చి, తుఫానులా గాలిలోకి ఎగిరాడు. పెద్ద కొండను చేరిన వాంగ్ తన నోటిలో నుండి చిన్న విసనకర్రని భుజంపై మోసుకుంటూ వేగంగా ముందుకు నడిచాడు.

సరిగ్గా ఆ సమయంలో మియాన్‌కాంగ్ తన విందు ముగించి రాజమహల్ నుండి బయటకి వచ్చి, అక్కడ తన పెంపుడు సింహం కనిపించకపోవడంతో చుట్టుప్రక్కల వెదికాడు. కానీ కనిపించలేదు. అంతలో అతనికి వాంగ్‌పై అనుమానం వచ్చి, "ఆ కోతిగాడు ఏదో చేసినట్లుంది. వెంటనే నా భార్య వద్దకు వెళ్ళాలి" అని అనుకొని గాలిలోకి ఎగిరాడు. మియాన్‌కాంగ్ వేగంగా గాలిలో ప్రయాణించసాగాడు.





కొంతసేపటికి మియాన్‌కాంగ్ తన గుహను చేరుకుని లోపల వున్న భార్య దగ్గరకు వెళ్ళాడు. విచారంగా వున్న రాకుమారిని చూసి, "ఏమైంది! ఆ కోతిగాడు ఇక్కడికి వచ్చి అల్లరి చేశాడా? ఎందుకు అలా విచారంగా వున్నావు" అని అడిగాడు. రాకుమారి విచారంతో, "ఆ కోతిగాడు మోసంతో మీ రూపంలో, మీ వాహనంపై వచ్చి, విసనకర్ర తీసుకుని పారిపోయాడు" అని ఏడ్వసాగింది.

అది విన్న మియాన్‌కాంగ్ "ఆ కోతిగాడికి అంత ధైర్యం వచ్చిందా. వాడిని ఆ రోజే అంతం చేసి వుండాలి. ఇంక వాడిని ప్రాణాలతో వదలకూడదు. వాడిని చంపి, ఆ విసనకర్రను తీసుకువస్తాను. నువ్వు బాధపడకు" అని తన భార్యని ఓదార్చి వాంగ్‌ని చంపడానికి ఆయుధాలు తీసుకుని మియాన్‌కాంగ్ కోపంతో బయటకు వెళ్ళాడు. రాకుమారి ఏడుస్తూ కుర్చీపై వాలింది. (ఇంకా వుంది)



# హత్యకు సాక్షి పసివాడు





ఆ పోలీసు అలసి కోపంతో వున్నాడు. కాని తన కోపాన్ని చిన్న పిల్లవాడి మీద ఎందుకని దిగమింగుకుని, "ఈ రోజు, విదేశాంగ మంత్రి మన నగరాన్ని చూడడానికి అటువైపు వస్తున్నారు. ఆయన్ని చూడ్డానికి జనం ఎక్కువమంది వచ్చారు. నువ్వు ఇంటికి వెళ్ళు, గుంపులో చిక్కుకుంటే ప్రమాదం!" అంటూ వెళ్ళిపోయాడు.

బాబుకి ఆయన్ని చూడాలనిపించింది. ఇంటికి వెళ్ళి తను చేయవలసిన పనేంలేదు. అందువలన ఇక్కడ వుండి, ఆయన్ని చూసి వెళదామనుకుని ముందుకు నడిచాడు.

ఆ గుంపులో నుండి బాబు సరిగ్గా చూడలేక పోయాడు. అంతలో ఏవో వాద్యాలు మొదలై, "వస్తున్నారు... వస్తున్నారు" అని అందరూ అరుస్తూ ముందుకు చూడసాగారు. బాబుకి ఏమీ కనబడలేదు. అందువలన వెనక్కి తిరిగి చూసాడు.

వెనక పది అంతస్తుల మేడ కనిపించింది. కిటికీలు చాలా వున్నాయి.

ఆ మేడ మీదికి వెళ్ళి, పైనుండి బాగా చూడవచ్చుననుకున్న బాబు గబగబా వెనక్కి తిరిగి మెట్లు ఎక్కసాగాడు.

అది పెద్ద ఆఫీసు లాగుంది. ఎవరూ సీట్లలో లేరు. అందరూ మంత్రిని చూడాలని, క్రిందికి వెళ్ళి వున్నారు. అది బాబుకు వీలుగా వుంది. ఎవరి అడ్డూ లేనందున పై అంతస్తుకు వెళ్ళసాగాడు.

అంతలో ప్రక్క గదిలో నుండి పెద్దగా మాటలు వినడంతో బాబు ఆగాడు. "ఆఫీసులో అందరూ బయటికి వెళ్లారే! ఎవరో ఎందుకు అలా అరుస్తున్నారు?" అనుకుంటూ అదేదో చూద్దామని అటు నడిచాడు.

అదే బాబు చేసిన పెద్ద పొరపాటు. దాని వలన తరువాత చాలా కష్టపడవలసి వచ్చింది.

గది తలుపులు మెల్లగా తెరిచి బాబు లోపలికి అడుగు పెట్టాడు.

ఖరీదైన సోఫాలో కోటు, సూటు ధరించి వున్న వ్యక్తి కూర్చున్నాడు. చూడడానికి ఆఫీసుకు పెద్దలా వున్నాడు. ఆయన ముందు ఇన్స్పెక్టర్

రివాల్వర్‌తో నిలబడి వున్నాడు.

అక్కడేదో విచిత్రం జరగబోతున్నదని, ఆసక్తితో చూడసాగాడు. ఆ ఇద్దరూ బాబుని గమనించ లేదు.

ఇన్స్పెక్టర్ నవ్వుతూ, ఎడమ చేతిలోని రివాల్వర్ కుడిచేతికి మార్చుకుంటూ, "బలరామ్! నువ్వు ఈ ఆఫీసుకు పెద్దవై వుండవచ్చు. అంత మాత్రాన నా విషయంలో అనవసరంగా జోక్యం కల్పించుకుంటున్నావ్. నా యిష్టం వచ్చిన చోట లంచం తీసుకుంటాను - నీ కెందుకా దురద? ఇప్పటికే నాలుగుసార్లు నాపై అధికారికి నా గురించి ఫోన్ చేసావు. ఇపుడు నేను లంచం తీసుకున్నట్టు ఏదో ఆధారం వుందని, నీవు నిన్న మా స్టేషన్‌కి ఫోన్ చేసావట! నేను చిన్న పిల్లవాడిని కాను, నా చేతిలో వున్న రివాల్వర్ దొంగలను చంపడానికి కాదు, నీలాంటి వాళ్ళని చంపడానికి పనికివస్తుంది.....హా... హా...!" అన్నాడు.

"పరాంకుశం! నన్ను హత్యచేసి నువ్వు తప్పించుకుపోలేవు. నా ఆఫీసులో నన్ను చంపుతుంటే, ఇక్కడ పనిచేస్తున్న వాళ్ళు వూరుకుంటారా? పిచ్చిగా వాగకు! మర్యాదగా బయటకి వెళ్ళు!" అన్నాడు బలరామ్.

"నేను మంచి సమయంలో వచ్చాను. నీ ఆఫీసులో మనిద్దరం తప్ప ఎవరూ లేరు. అందరూ బయట మంత్రిగారిని చూడడానికి వెళ్ళారు. అందుకే నేను వచ్చాను. నిన్ను చంపితే, ఎవరికీ నా సంగతి తెలియదు" అంటూ పరాంకుశం ఎడమ చేత్తో జేబులో నుండి కర్చీఫ్ బయటకు తీసాడు.

అపుడు జేబులో వున్న పర్సు క్రింద పడిన సంగతి అతను గమనించలేదు. కాని బాబు దాన్ని గమనించాడు.

ఆ పర్సులో, ఇన్స్పెక్టర్ పేరు వివరాలతో, అతని గుర్తింపు కార్డు వుంది.

బయట జనం కేకలు పెద్దగా వినిపిస్తు



న్నాయి. అది గమనించిన పరాంకుశం, "బల రామ్! నీ ఇష్ట దైవాన్ని ప్రార్థించుకో! ఇక సమయం దాటిపోతుంది..." అంటూ రివాల్వర్ గురి పెట్టి "ఒన్..టూ..త్రీ" అంటూ కాల్చాడు.

గుండు ధనమని గురిగా బలరామ్ తలకి తగలడంతో అతను అలాగే నిలుచున్న కూలి పోయాడు.

ఆ దృశ్యాం చూడడంతో బాబు భయంతో పెద్దగా అరిచాడు.

అదివిన్న పరాంకుశం ఆశ్చర్యపోయి, "నా వెనుక ఎవరున్నారు?" అనుకుంటూ తిరిగి చూశాడు. తలుపు దగ్గర చిన్న పిల్లవాడు గుబ గుబ వణుకుతూ నిలబడి వున్నాడు. "తాను చేసిన హత్యకు సాక్షి ఎవరూ లేరనుకుని ధైర్యంగా ఉన్నాడు. కానీ, ఇప్పుడు పిల్లవాడు చూసాడు. వీడిని ప్రాణాలతో వదలకూడదు. లేకుంటే తనకి అపాయం తప్పదు!" అని మనసులో అనుకుంటూ రివాల్వర్ బాబుకి గురి పెట్టాడు.

"నన్ను చంపకండి!.. నేను వెళ్ళిపోతాను!" అంటూ బాబు ఏడ్వసాగాడు.

కానీ ఆ కఠిన హృదయుడి మనసు కరగ లేదు. "నిన్ను వదిలితే, తరువాత చాలా అపా యం, అందువలన ఇప్పుడే నిన్ను చంపాలి" అంటూ ట్రిగర్ నొక్కాడు.

కానీ రివాల్వర్ పేలలేదు కారణం అందులో గుండ్లు లేవు. భగవంతుడు మంచి సమయంలో బాబుని రక్షించాడు.

దానితో పరాంకుశం కోపం పెరిగింది. "ఛీ..పాడు" అంటూ రివాల్వర్‌ని నేలకేసి కొట్టాడు. "ఒరేయ్! మర్యాదగా నా దగ్గరకు రా" అని పెద్దగా పరాంకుశం అరిచాడు.

బాబు పుస్తకాల సంచి క్రింద పెట్టి బిక్కు బిక్కు మంటూ అతని దగ్గరకు వచ్చాడు.

"ఇక్కడి కెందుకొచ్చావురా?- అందరూ బయట మంత్రిని చూస్తుంటే, ఇక్కడేం చేస్తు న్నావ్. రాస్కెల్!" అంటూ బాబు చెంపమీద



లాగి కొట్టాడు. ఆ దెబ్బకి బాబు క్రింద పడ్డాడు. అతనికి నేలమీద వున్న పర్సు తగిలింది. దాన్ని తన చేతికి తీసుకున్నాడు.

అంతలో పరాంకుశం, "నీ నాలుక కోస్తాను. ఇక్కడ జరిగిన సంగతి ఎవరికీ చెప్పావో" అంటూ వెనక్కి తిరిగి టేబుల్ మీద ఏదైనా కత్తి గాని, బ్లేడుగాని వుందా అని చూడసాగాడు.

అదే మంచి సమయం అనుకుని బాబు పర్సుతో పరిగెత్తాడు. ఆ శబ్దం వినడంతో పరాంకుశం వెనక్కి తిరిగి, పరిగెత్తుతున్న బాబు చేతిలో నల్లగా మెరుస్తున్న దాన్ని గమనించి, జేబు తడివి చూసుకుని, "అరెరె! నా పర్సు తీసుకుపోతున్నాడే! అందులో నా వివరాలన్నీ వున్నాయే. వాణ్ని వదలకూడదు!" అనుకుంటూ పరుగెత్తబోయి, దారికి అడ్డంగా వున్న పుస్తకాల సంచి తగిలి నేలమీద బోర్లా పడ్డాడు.

నెత్తికి తగిలిన దెబ్బను రుద్దుకుంటూ, పైకి లేచి పరాంకుశం క్రిందికి పరిగెత్తాడు. కానీ జనం గుంపులో అతనికి పిల్లవాడు కనిపించ లేదు.

నిరాశతో పరాంకుశం తిరిగి పైకివచ్చి, క్రింద పడి వున్న పుస్తకాల సంచిని చూడగానే అతడికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

"ఈ పుస్తకాల సహాయంతో, వాడి బడి సులభంగా తెల్సుకోవచ్చు" అనుకుంటూ పరాంకుశం, దాన్ని తీసుకుని బయటికి గడప దిగాడు.

పరాంకుశం, పుస్తకాలలో వ్రాసి వున్న బాబు బడి పేరు చూసుకుని, తిన్నగా ఆ బడికి వెళ్ళి హెడ్ మాస్టర్‌తో కలిసి మాట్లాడాడు.

బడికి ఇన్స్‌పెక్టర్ రావడం చూసి, ఆయన కంగారు పడుతూ, "ఏం జరిగింది? ఎందుకు వచ్చారు మీరు?" అనడిగాడు.

పరాంకుశం నవ్వుతూ, "నే నిక్కడికి రాకూడదా? ఎందుకు కంగారు పడతారు?" అంటూ బాబు పుస్తకాల సంచి నుండి ఒక



చిరునామా కావాలి!" అన్నాడు.

అందుకు ఆయన ఇంకా ఆశ్చర్యపోతూ, "ఎందుకు? ఆ పిల్లవాడు ఏం తప్పు చేసాడు?" అనడిగాడు.

"మీరు కంగారులో వున్నట్టుంది. ఈ పిల్లవాడికి దారిలో ఆక్సిడెంట్ జరిగి, దెబ్బలతో హాస్పిటల్‌లో చేర్పించాం. మరి ఆ సంగతి ఆ పిల్లవాని తల్లిదండ్రులకి చెప్పాలి కదా! పిల్లవాడు చావు బ్రతుకుల్లో వున్నాడు. మీరు త్వరగా అతని ఇంటి అడ్రసు ఇస్తే, వారి ఇంటికి వెళ్ళి సంగతి చెప్పగలను!" విచారంతో అన్నాడు పరాంకుశం.

"అలాగా! అయితే వుండండి. పిల్లవాని చిరునామా ఇస్తాను!" అంటూ ఆయన లోపలికి వెళ్లాడు.

పది నిమిషాల తరువాత ఆయన, చిన్న కాగితం మీద బాబు అడ్రసు తీసుకువచ్చి, తల్లిదండ్రులకు చెప్పండి, మీరు చేస్తున్న సహాయానికి చాలా సంతోషం!" అన్నాడు.

"బాబూ! ఇక నా చేతినుండి తప్పించుకు పోలేవు. నీ చావు నా చేతిలో వుంది!" అని పరాంకుశం అనుకుంటూ, ఆ చిన్న కాగితం తీసుకుని బయటికి నడిచాడు.

బాబు చీకటి పడేవరకు, సందులు, గొందులు తిరిగి, ఆలస్యంగా ఇంటికి వచ్చాడు.

ఇంటి ముందు పోలీస్ జీపుని చూడడంతో, అతని గుండె జల్లుమంది. మెల్లగా కిటికీలో నుండి లోపలికి చూశాడు.

ఇన్స్‌పెక్టర్ పరాంకుశం, తన తల్లిదండ్రులతో మాట్లాడుతున్నాడు.

"ఇంత ఆలస్యమైంది. ఇంతవరకు బాబు ఎందుకు రాలేదండీ! ఎవరైనా బంధువుల ఇంటికి వెళ్ళాడా?" అన్నాడు ఇన్స్పెక్టర్.

బాబు తల్లి భయపడుతూ "వాడు ఎప్పుడూ



ఇంత ఆలస్యం చేయడు. ఎక్కడికి వెళ్లాడో. మీరు వాడికి బహుమతి ఏదో ఇవ్వాలని గంట నుండి ఎదురు చూస్తున్నారు పాపం!" అన్నది.

అంతా వింటున్న బాబు, తాను లోపలికి వెళితే, చాలా అపాయమని తలచి, వెనక్కి తిరిగాడు. ఉన్నట్టుండి అతనికి ఓ ఆలోచన వచ్చింది. తాను చూసిన వాళ్ళ గురించి, ఏదైనా పోలీస్ స్టేషన్‌లో చెప్పాలని.

కానీ, దారిలో తనని ఆ ఇన్‌స్పెక్టర్ చూసాడంటే, తనకు అపాయం తప్పదు. అందు వలన తనకి బదులు ఎవరినైనా పంపాలను కున్నాడు.

అంతలో "బాబూ! అన్న కేక విని తల పైకెత్తి చూసాడు. మేడ మీద అతని స్నేహితుడు రాజు ఉన్నాడు.

రాజుని చూడడంతో బాబుకి ఓ ఆలోచన వచ్చి, గబ గబా పైకి వెళ్ళి, అతనితో తన సంగతంతా వివరంగా చెప్పి, వెంటనే పోలీసు లను కాళికాదేవి గుడి వద్దకు తీసుకు రమ్మ న్నాడు. అంతవరకు తాను ఎవరికీ తెలియ కుండా అక్కడ వుండదల్చుకున్నానని బాబు ఆలోచన.

రాజు సరేనని, వెంటనే బయలుదేరాడు. బాబు తిన్నగా కాళికాదేవి గుడివద్దకు చేరాడు.

ఇన్‌స్పెక్టర్ పరాంకుశం చాలాసేపు బాబు కోసం వేచి చూసి, విసిగి, వారితో గంట దాటిన తరువాత తిరిగి వస్తానని చెప్పి, బయటికి వెళ్లాడు.



పరాంకుశం మెల్లగా జీపుని ముందుకు నడుపుతూ, బాబుని గురించి ఆలోచించ సాగాడు.

కొంత దూరంలో చిన్న పిల్లవాడు పోతుండ డం - చూసి, "అరెరే, వాడు బాబులా వున్నాడే!" అనుకుని, జీపు వేగంగా నడిపి, వాని ముందు నిలిపాడు.

దగ్గరగా వెళ్ళి చూస్తే, ఆ పిల్లవాడు బాబు కాదు అని పరాంకుశం తెలిసికుని, "ఏయ్, ఒంటరిగా ఎక్కడికి వెళుతున్నావు?" అని గద్దించాడు.

అందుకా పిల్లవాడు, "నా పేరు రాజు. నేను పోలీస్ స్టేషన్‌కు త్వరగా వెళ్లాలి. నన్ను



తీసుకు వెళతారా?" అన్నాడు.

ఆ మాటలకు అతను ఆశ్చర్యపోతూ, "పోలీస్‌స్టేషన్‌లో నీకు ఏం పని?" అని అడిగాడు.

"నా మిత్రుడు బాబు, ఏదో హత్య చూసాడట! ఆసంగతి పోలీస్ వారికి చెప్పి, తీసుకు రమ్మన్నాడు!" అని పరాంకుశంతో అన్నాడు రాజు.

ఆ మాటలకు పరాంకుశం కళ్ళు మెరిసాయి. "అమ్మ దొంగా! నా చేతినుండి నువ్వు తప్పించుకో లేవు. నా మీద రిపోర్టు ఇవ్వాలను కున్నావా? నీ అంతు కనుక్కుంటా చూడు!" అనుకుని, పైకి "రాజూ! నేను ఇన్‌స్పెక్టర్‌ని. నేను ఆ బాబుకు సహాయం చేస్తాను. నువ్వు బాబు ఎక్కడ వున్నాడో చూపుతావా? రా... జీపులో ఎక్కు!" అంటూ రాజుని జీపులో ఎక్కించుకున్నాడు.

జీపు వేగంగా వెళ్ళి ఊరి చివరన వున్న కాళికాదేవి గుడి ముందు ఆగింది.

బాగా చీకటిగా వున్నందు వలన జన సంచారం లేనేలేదు.

ఆలయంలో ఒక పాడుపడిన స్తంభం వెనుక దాగి వున్న బాబు, జీపు ఆగిన శబ్దం విని, బయటకి చూసాడు.

జీపులో నుండి, రాజుతో పాటు, ఇన్‌స్పెక్టర్ దిగాడు. అంతా చీకటిగా వున్నందువలన బాబు వారిని సరిగ్గా గుర్తుపట్టలేకపోయాడు.

ఇన్స్పెక్టర్, రాజు చేయి పట్టుకుని రెండడుగులు ముందుకు వేశాడు. అప్పుడు అతని మీద సన్నని వెలుతురు పడటం వల్ల బాబు అతన్ని గమనించాడు.

"అయ్యో! రాజు హంతకుడిని తన దగ్గరకు పిలుచుకు వస్తున్నాడే! అతని చేతికి దొరికితే, అంతే!" అనుకుని, స్తంభం వెనుక నుండి వచ్చి, వేగంగా బయటకి పరుగెత్తాడు.

అది గమనించిన పరాంకుశం, రాజు చేయి వదిలి, బాబు వెళ్ళిన దిక్కుకు గురి చూసి తుపాకీ పేల్చాడు. కానీ బాబు, చీకటిలో ఎటో పారిపోయాడు.

పరాంకుశం చాలా దూరం ముందుకు వెళ్ళి

చూశాడు. కానీ బాబు కనబడలేదు. చివరికి విసుగుతో తిరిగి వచ్చి, రాజుతో జీపుని ముందుకు నడిపాడు.

కొంతదూరం ముందుకు వెళ్లిన వెంటనే రాజు, "ఎందుకు మీరు బాబుని తుపాకీతో కాల్చడానికి ప్రయత్నించారు? అతన్ని కాపాడడానికే మిమ్మల్ని తీసుకు వచ్చాను. మీరు చేసిన పని ఏమీ బాగాలేదు. పాపం! బాబు ఎందుకు మిమ్మల్ని చూసి పారిపోయాడో చెప్పండి!" అన్నాడు.

పరాంకుశం కోపంతో, "కుర్రకుంకా! పిచ్చిగా మాట్లాడకుండా, నోర్మూసుకుని నా వెంట రా! నాకు చాలా కోపంగా ఉంది!" అన్నాడు.

"మీ మాటలు నాకు అర్థం కావటం లేదు. ఎవరో హత్య చేసినందుకు బాబు సాక్షి. మీరు అతన్ని చంపివేయడానికి ప్రయత్నిస్తున్నారంటే... మీరు... మీరు నిజంగా..." అని రాజు భయంతో ఆగిపోయాడు.

అందుకు పరాంకుశం వికటంగా నవ్వుతూ, "నేను చేసిన హత్యకి సాక్షి బాబు. మరి వాడిని చంపక వదిలిపెట్టమంటావా?... ఇప్పుడు నీకు ఆ సంగతి తెలిసింది. ఇక నిన్నూ ప్రాణంతో వదలననేది ఖాయం. నా రహస్యం తెలిసిన వాళ్లని చంపకుండా వదలను" జీపు వేగంగా నడుపుతూ అన్నాడు.

దాంతో రాజు భయపడి, "నన్నేం చేయకండి! ఈ సంగతి నేను ఎవరికీ చెప్పను" అని ప్రాధేయపడ్డాడు.



అంతలో జీపు పరాంకుశం ఇంటిముందు ఆగింది.

పరాంకుశం జీపు నుండి దిగి, "ఒరేయ్! అల్లరి చేయకుండా నాతో లోపలికి రా! నీ సంగతి తేల్చి చూస్తాను" అని అన్నాడు.

రాజు మెల్లగా క్రిందికి దిగి, "సార్! నన్ను వదిలేయండి! ఇప్పటికే బాగా చీకటైంది. నేను ఇంటికి రాలేదని మా అమ్మా-నాన్న, నా కోసం వెదుకుతుంటారు... ప్లీజ్.. నన్ను వదిలేయండి! మీ సంగతి నే నెవరికీ చెప్పను!" అని దీనంగా వేడుకోసాగాడు.

పరాంకుశం కోపంతో, "ఎక్కువ మాట్లాడితే,



నిన్ను ఇక్కడే కాల్చి చంపుతాను. మర్యాదగా లోపలికి నడవరా" అంటూ వెనక్కి తిరిగాడు.

రాజుకు భయంతో పాటు పిచ్చి కోపం ఎక్కువైంది. తాను లోపలికి వెళితే, తప్పకుండా పరాంకుశం చంపేస్తాడని రాజుకి తెలుసు. అందువలన వెంటనే తప్పించుకోవాలను కున్నాడు.

ఆ క్షణంలో ఏదో వెర్రి ఆలోచన రావ డంతో, రాజు వెనక్కి తిరిగి వున్న పరాంకుశాన్ని బలంగా రెండు చేతులతో తోసాడు.

ఏదో ఆలోచనలో వున్న పరాంకుశం, తటాలున పాలి గోడ మీద పడ్డాడు.

ఆ అవకాశాన్ని రాజు జారవిడుచుకోలేదు. వెంటనే తిరిగి వేగంగా పరుగెత్తసాగాడు.

అంతా గాఢాంధకారంగా వున్నందున రాజుని అతను పట్టుకోలేకపోయాడు. రాజు నాలుగు గొందులు తిరిగి, ఎలాగో తప్పించి ఇల్లు చేరు కున్నాడు.

అప్పటికే రాజు ఇంటికి రాకపోవడంతో ఇంట్లో అందరూ బెంగతో వున్నారు. రాజు వగరుస్తూ పరుగెత్తుకు రావడం చూసి, కారణ మడిగారు.

రాజు అంతా వివరంగా చెప్పడంతో, వాళ్ళు ఆశ్చర్యపోయి, తెల్లవారిన తరువాత పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి అంతా చెబుదామని రాజుని సముదాయించారు.

తెల్లవారింది. బాబు నగరానికి వెలుపల వున్న పొలాల్లో దాగి, మెల్లగా బయటికి



వెళ్లాడు బాబు.

రాత్రి తాను దాగి వున్న స్తంభం పక్కన ఆ పర్సు కనబడింది. దాన్ని పోలీస్ వద్దకు తీసుకుని, వెళ్లి చూపాడు.

పర్సు తెరిచి చూసిన అతను, "ఆ.. వరాంకుశం! నువ్వా? నేను అనుకున్నాను. ఇలాంటి పని మన డిపార్ట్‌మెంట్‌లో ఎవ్వరూ చెయ్యరని. నీలాంటి నీచుడివల్ల అందరికీ చెడ్డ పేరు వస్తున్నది.. నిన్ను ముందు లోపలికి తొయ్యాలి!" అనుకుని, పైకి "రా...బాబూ! మనం ఇక్కడికి దగ్గరిలో వున్న పోలీస్ స్టేషన్‌కి వెళదాం. నువ్వు అక్కడ వివరంగా జరిగిన కథంతా వారికి చెప్పు!" అంటూ బాబుని దగ్గరికి పిలిచాడు.

అంతలో తుపాకీ పేల్చిన శబ్దం విని, ఇద్దరూ అదిరిపడి అటు చూసారు.

ఎదురుగా తుపాకీతో వరాంకుశం నవ్వుతూ నిలబడి వున్నాడు.

"ఇద్దరూ గొడవ చేయకుండా నా జీపులోకి ఎక్కండి! లేదా ఇద్దరిని శవాలను చేసి నేను వెళ్ళవలసి వుంటుంది" అన్నాడు.

అదివిని పోలీస్, "నీచుడా! మర్యాదగా నువ్వు లొంగిపో. నువ్వు తప్పించుకోలేవు. నా ప్రాణం పోయినా నీకు లొంగను!" అన్నాడు.

అది గమనించిన వరాంకుశం, "నా సంగతి నీకు తెలియదు. ఒక హత్య చేసిన తర్వాత నాకు చంపడం అనేది పెద్ద కష్టం కాదు..." అంటూ తుపాకి పేల్చాడు.

గుండు సరిగా పోలీస్‌కి తగలడంతో, అతను 'అమ్మా' అని అరిచి క్రింద పడ్డాడు. అతని చేతిలో వున్న పర్సు క్రింద పడింది.

బాబు ఆ పర్సును తీసుకుని "నన్ను ఏమీ చేయకు, నీ పర్సు నీకు ఇచ్చేస్తాను!" అంటూ పెద్దగా ఏడ్వసాగాడు.

"చిన్న వెధవ్వా! రాత్రంతా నన్ను ఎంత గాబరా పెట్టించావు? రాత్రంతా నీ వల్ల నాకు నిద్ర కూడా రాలేదు. అందుకే తెల్లవారి ఇక్కడికి వచ్చాను. నువ్వు గోల చేయకుండా నా జీపులో ఎక్కు!" అన్నాడు.

బాబు భయపడుతూ తిన్నగా వెళ్లి జీపులో

కూర్చున్నాడు. అతని చేతిలో వున్న పర్సును పరాంకుశం లాక్కుని తన జేబులో వేసుకుని, "నిన్ను ఏం చేయాలో తరువాత ఆలోచిస్తాను" అంటూ వెనక్కి తిరిగి, "ఈ పోలీస్ శవం ఇక్కడ వుంటే ప్రమాదం!" అనుకుంటూ, ఆ శవాన్ని మోసుకుని జీపులో పడేశాడు.

నగరంలో రాజు, తన తల్లిదండ్రులను, బాబు తల్లిదండ్రులను పిల్చుకుని తిన్నగా పోలీస్ స్టేషన్‌కు వెళ్లారు.

ఆ సమయంలో ఇన్స్‌పెక్టర్ సీటులో లేడు. ఆయన ఏదో హత్య కేసును విచారించడానికి వెళ్ళారని రైటర్ చెప్పడంతో వాళ్లు అక్కడే కూర్చున్నారు.

గంట సేపయిన తరువాత ఇన్స్‌పెక్టర్ వచ్చారు. ఆయన రావడంతో, రాజు పరుగెత్తుకెళ్లి, ఆయనతో అంతా వివరంగా చెప్పాడు.

అది విన్న వెంటనే ఆయన ఆనందంతో, రాజును ఎత్తి తన టేబుల్ మీద కూర్చో పెట్టుకుని, "నిన్నటి నుండి ఆ పరాంకుశాన్ని మేము వెదుకుతున్నాం. బలరామ్‌ని హత్య చేసింది అతడేనని నాకు ఆధారంతో తెల్సిపోయింది. పాపం చిన్న పిల్లవాడిని తరుముతున్నాడా? ఇప్పుడే వాడి అంతు తేలుస్తాను. అయినా ఆ పరాంకుశాన్ని పట్టుకోవాలంటే బాబు ఎక్కడున్నాడో తెలియాలి!" అన్నారు.

"బాబు నిన్న రాత్రి కాళి గుడిలో దాగి వున్నాడు. ఆ పరాంకుశాన్ని చూసి, పొలాల్లోకి పరిగెత్తిపోయాడు. మనం అక్కడికి వెళ్ళామంటే



బాబుని చూడవచ్చు. లేకపోతే ఆ పరాంకుశం వాడిని చంపేయగలడు. మీరు నాతో రండి!" అన్నాడు రాజు.

అంతలో అక్కడున్న బాబు తల్లి, "ఇన్స్‌పెక్టర్ గారూ, దయచేసి త్వరగా బయలుదేరండి! లేకపోతే మా బాబు దుష్టుడి చేతిలో హతమౌతాడు. రాత్రంతటా ఎంత కష్టపడ్డాడో? తిండి కూడా తిని వుండడు. మాకు చాలా భయంగా వుందండీ!" అంటూ కంట తడి పెట్టింది.

"మీరు కంగారు పడకండి! ఆ పరాంకుశం మీ బాబును చంపడు. మనం ఇప్పుడే అక్కడికి బయలుదేరుదాం. నేను నిన్నటి నుండి ఆ



పరాంకుశాన్ని వెతుకుతున్నాము. మీ బాబు నిన్న నాకు ఈ సంగతి తెలిసి వుంటే, ఇన్ని కష్టాలు పడేవాడు కాదు. మనం ఇప్పుడే బయలు దేరుదాం!" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

మరుక్షణంలో వేన్‌లో పదిమంది పోలీసులు. అందరూ ఎక్కారు. ఇన్స్‌పెక్టర్ ఎక్కి వేగంగా ముందుకు నడప సాగాడు.

అక్కడ పరాంకుశం జీపులో వున్న బాబు భయపడుతూ, అతడి నుండి ఎలా తప్పించుకు పారిపోవాలా– అని ఆలోచించసాగాడు.

అంతలో బాబు చురుకైన కళ్ళు, జీపులో వున్న తాళం చెవుల మీద పడింది. తక్షణమంగా వాటిని తీసుకుని దూరంగా ఉన్న పొదలోకి విసిరాడు. అది పరాంకుశం గమనించలేదు.

పరాంకుశం జీపును స్టార్ట్ చేయబోయే తాళం చెవులు లేకపోవడం చూసి అవి జేబులో చూసుకున్నాడు. ఎక్కడా కనిపించలేదు. వెనక్కి తిరిగి కోపంతో, "బాబూ! తాళం చెవులు ఎక్కడ దాచావ్? మర్యాదగా ఇవ్వు!" అరిచాడు.

"నాకు ఏం తెలియదు. కావాలంటే నన్ను సోదా చేసుకోండి!" అమాయకంగా అన్నాడు బాబు.

అతనికి బాబు మీద నమ్మకం లేదు. చేతిలో వున్న తుపాకీ సీటు మీద పెట్టి, బాబు జేబులన్నీ వెతికాడు. కాని తాళం చెవులు కనబడలేదు. దూరంగా ఎక్కడైనా విసిరి వుంటాడన్న అనుమానంతో బయట వెదక సాగాడు.

అంతలో బాబు ముందు సీటులో వున్న తుపాకీ చేతిలోకి తీసుకుని, జీపులో నుండి బయటికి దిగాడు.

"పరాంకుశం! మర్యాదగా చేతులు పైకెత్తు! లేదా నిన్ను కాల్చి చంపుతాను!" అన్నాడు.

ఆ మాటలకు పరాంకుశం అదిరిపోయి వెనక్కి తిరిగి, "చిన్న వెధవా! నన్ను చంపడానికి నీకెన్ని గుండెలురా?" అంటూ రెండడుగులు వేశాడు.

బాబు తన బలమంతా ఉపయోగించి, ట్రిగ్గర్ని నొక్కాడు. గుండు అతని ప్రక్కగా దూసుకు వెళ్ళింది.

ఆయన్ని చంపుతానని బెదిరించావు. చంపావు. తరువాత వెళ్ళిపోయావు.

కొంతసేపైన తరువాత నాకు హత్య సంగతి తెలిసి, అక్కడికి వెళ్ళి, అంతా పరిశీలించాను. ఆయన చేయి సొరుగు మీద వుండటంతో అనుమానించి, తెరిచి అందులో వున్న చిన్న టేపు రికార్డరును బయటకు తీసి, దాన్ని వేసి చూసాం. అందులో నీ మాటలు బాగా రికార్డ్ అయినాయి.

వెంటనే నిన్ను బంధించాలని మీ ఇంటికి బయలుదేరాం. నువ్వు రాలేదు. రాత్రంతా నీ కోసం వెతికి, వెతికి విసిగిపోయాం. తెల్లవారి రాజు చెప్పిన మాటలు విని, నేను ఇక్కడికి వచ్చాను. ఇక నువ్వు తప్పించుకోలేవు." అన్నాడు ఇన్స్‌పెక్టర్.

పరాంకుశం నవ్వుతూ, "అయితే నేను చేసిన హత్యకు ఆధారం దొరికిందా? బలరామ్ తెలివైనవాడే!" అంటూ మెల్లగా క్రింద పడివున్న తుపాకీ తీసుకుని అందరికీ గురిపెట్టి, "ఎవరైనా ఒక్క అడుగు కదిలితే కాల్చి చంపుతాను!" అంటూ అడుగులు వెనక్కి వేయసాగాడు.

ఇన్స్‌పెక్టర్ కోపంతో, "పరాంకుశం, నువ్వు తప్పించుకోలేవు. మర్యాదగా లొంగి పో!" అని అరిచాడు.

పరాంకుశం వెనక్కి అడుగులు వేస్తూ కాలికి పెద్ద రాయి తగలడంతో, అతను వెనక్కి తూలి పడ్డాడు. చేతిలోని తుపాకి ఎగిరి క్రింద పడ్డది. అంతలో బాబు క్రింద పడిన తుపాకి చేతిలోకి తీసుకున్నాడు. పోలీసులు క్రింద పడివున్న పరాంకుశాన్ని చుట్టుముట్టారు.

వెంటనే పోలీసులు పరాంకుశం చేతికి బేడీలు తగిలించి, వేన్‌లో ఎక్కించారు. మిగిలిన వాళ్ళు వెళ్ళారు.

కొంతసేపటికి వేన్ ముందుకు కదిలింది. బాబు సంతోషంతో, తల్లిదండ్రుల భుజం మీద చేయి వేసుకున్నాడు.





# స్వర్ణలోయ

(యువరాజు స్వర్ణలోయకు దారి వెతుకుతూ దారిలో యోగానందస్వామి గుహను చేరాడు. ఆయన వద్ద వున్న అమృత గుళికలు, తీసుకురావాలని ఆ రాత్రి దాన్ని దొంగిలించాడు. కానీ, మరునాడు ఆయన తెలుసుకొని, ప్రతాప్ వద్ద వున్న అమృత గుళికను తీసుకొని, అమృత గుళిక ఎక్కడ దొరుకుతుందోనన్నది వివరంగా చెప్పాడు.)

## 8

యోగానంద స్వామి చెప్పినది విని ప్రతాప్, "అలాగా, తప్పకుండా వెళతాను" అంటూ ఆయన చూపిన దిశ వైపు పరిగెత్తాడు.

కొంత సేపటికి పెద్దగా శబ్దం చేస్తూ గండ భేరుండ పక్షి అక్కడికి వచ్చి ఆగింది. ప్రతాప్ దానికి తెలియకుండా, దాని కాలిని గట్టిగా పట్టుకున్నాడు.

తరువాత కొంతసేపటికి ఆ పక్షి పెద్దగా శబ్దం చేస్తూ, పైకి ఎగిరింది.

అది పోతున్న వేగానికి ప్రతాప్ తట్టుకో లేకపోయాడు. ఎక్కడ జారిపోతాడో అని భయపడసాగాడు.

చాలా సేపటికి ఆ పక్షి చిన్న లోయలోకి

బి.ఆర్. వరదరాజులు, మద్రాసు



దిగింది. పక్షిని చూడడంతో, అక్కడ తిరుగు తున్న పాములు, చెల్లాచెదురైనాయి. అన్నీ వేగంగా ముందుకు వెళ్లసాగాయి.

ప్రతాప్ మెల్లిగా క్రిందికి దిగి, అమృత గుళికలు ఎక్కడ ఉన్నాయో అని వెదక సాగాడు. అతని కంటికి పాములు తప్ప ఏమీ కనబడటంలేదు. అయినా, అతడు వెదక సాగాడు. కానీ అతనికి అవి వున్న తావు తెలియలేదు.

పక్షికి నాలుగు పాముల్ని తినడంతో, ఆకలి తీరినట్లుంది. అందువల్ల అది చిన్న ట్లుండి ఎగిరి వెళ్లిపోయింది. అది గమనించిన ప్రతాప్ పక్షిని పట్టుకుందామని పరుగెత్త బోయి కాలికి రాయి తగలడంతో క్రింద పడ్డాడు. అప్పటికే పక్షి ఎగిరిపోయింది.

ప్రతాప్ విచారపడుతూ, తనకు అడ్డువచ్చిన రాయిని తీసుకొని కోపంతో విసిరాడు. అది క్రింద పడి రెండుగా చీలి అందులో నుండి అమృత గుళిక క్రింద పడింది.

దాన్ని చూడడంతో ప్రతాప్ పరుగెత్తుకు వెళ్ళి, పరీక్షించాడు. "ఆ... నిజంగా ఇది అమృత గుళికే! అదృష్టంగా దొరికింది. ఇక ఆ పక్షి వచ్చేవరకు నేను వేచి వుండాలి కాబోలు!" అని మనసులో అనుకుని, అమృత గుళికను మింగాడు.

పాములు ఎక్కువగా తిరుగుతున్నందువల్ల ప్రతాప్ ఒక మూలలో ఒదిగి కూర్చున్నాడు. రాత్రంతా అక్కడ గడపాలని అనుకున్నాడు. అలాగే నిద్రలోకి పోయాడు.

తెల్లవారింది. నిద్రపోతున్న ప్రతాప్‌కు తన శరీరం మీద ఏదో బలమైన వస్తువు పడినట్లు అనిపించి, తక్షణం కళ్ళు తెరిచి చూశాడు.

అంతే! ఆశ్చర్యపోయాడు. పెద్ద కొండ చిలువ, అతన్ని పూర్తిగా చుట్టేసింది. ఇక అది గట్టిగా అదిమిందంటే, లోపలున్న ఎము కలు పిప్పి అయిపోతాయి. దానివల్ల తప్పించు కోవడం ఎలా అని ప్రతాప్ ఆలోచిస్తూ బయటికి రావడానికి ఎన్ని విధాలుగానో ప్రయత్నించసాగాడు.

వున్నట్టుండి అతని దుస్తుల్లో వున్న పి

బాకు అతని చేతులకు తగిలింది. అది శక్తిమంతమైనది. ఇటువంటి ప్రమాదాలు ఎదుర్కోవాలసి వస్తుందనే జయపాలుని సలహా మేరకు సముద్రం అడుగున వున్న నౌకలో నుండి తెచ్చిన సంగతి అతనికప్పుడు స్ఫురించింది.

"అరెరే... ఇంత శక్తిమంతమైన కత్తిని దగ్గర వుంచుకుని ఎందుకు కష్టపడాలి? క్షణంలో ఈ కొండచిలువ సంగతి తేల్చాలి." అతి కష్టంతో కత్తిని బయటకిలాగి, పిడికిలి గట్టిగా అదిమి, "వెంటనే ఈ కొండచిలువను నాశనం చెయ్యి" అని అరిచాడు.

సరిగ్గా అదే సమయానికి కొండచిలువ, అతన్ని గట్టిగా అదమాలని ప్రయత్నించ సాగింది. కానీ అంతలో పిడిబాకు దాని తలను నరికింది. మరుక్షణం అది, ప్రతాప్ శరీరాన్ని వదిలిపెట్టింది.

దాన్ని ముక్కలుగా నరికి, తిరిగి పిడిబాకు ప్రతాప్ వద్దకు వచ్చి చేరింది.

ఆ సంఘటనని గమనించిన మిగతా పాములు, అతనికి దూరంగా వెళ్లసాగాయి. అతని చుట్టూ పదడుగుల దూరం వరకూ చిన్న పాము కూడా రావటం లేదు. అది చూసి ప్రతాప్ సంతోషించి, హాయిగా నిద్ర పోయాడు.

తెల్లారింది. ప్రతాప్ గండ భేరుండ పక్షి కోసం ఎదురు చూడసాగాడు. ఎంతసేపైనా పక్షి రాలేదు. ప్రతాప్ ఆశ్చర్యపోయాడు. "అది



ప్రతిరోజూ వస్తుందా? లేక వారం రోజుల కొకసారి వస్తుందా? అని సందేహపడ్డాడు. ఇక పక్షి రాకపోతే, తన గతి ఇంతేనా? ఇప్పటిదాకా నేను పడ్డ శ్రమంతా వృథాయేనా! ఎన్నో బాధలు పడి కష్టాలు, పాములు వంటి జంతువులతో పోరాడి అత్యంత శ్రమతో ఇక్కడకు చేరుకున్నాను. చివరికి ఇలాగయిందేంటి?" అని విచారపడ్డాడు.

అంతలో ఆకాశంలో ఏదో శబ్దం వినబడటంతో, తల పైకెత్తి చూసాడు. గండ భేరుండ పక్షి వేగంగా వస్తోంది.

దాన్ని చూసి ప్రతాప్, "అమ్మయ్య, పక్షి



వస్తున్నది. నాకు పాముల బెడద తప్పింది!" అని అనుకున్నాడు

అది క్రిందికి దిగి పాముల్ని చంపసాగింది. అంతలో దాని మీదికి ఎక్కి కూర్చోవాలని ప్రతాప్ మెల్లగా నడిచాడు.

అంతలో మరొక గండ భేరుండ పక్షి అక్కడికి రావడం చూసి, ప్రతాప్ అదిరిపోయాడు. తాను ఏ పక్షి ద్వారా పోవాలో తెలియక దిక్కులు చూడసాగాడు. తాను వచ్చిన పక్షిని ఎలా గుర్తు పెట్టుకోగలడు. ఇప్పుడు వేరొక పక్షి కాళ్ళు పట్టుకుని వెళితే, అది ఎక్కడికి తీసుకుపోతుందో... ఏమో?!" అని ఆలోచించసాగాడు. కొంతసేపటికి మొదట వచ్చిన పక్షి ఎగిరిపోయింది. సందిగ్ధావస్థలో వున్న ప్రతాప్ దాని మీద ఎక్కకుండా వుండి పోయాడు.

చివరికి రెండో పక్షి ఎగురుతుండగా, ప్రతాప్ పరిగెత్తుకుంటూ వెళ్ళి దాని కాలు పట్టుకున్నాడు. అది వేగంగా గాలిలోకి లేచింది.

వున్నట్టుండి పక్షికి, కాలిమీద ఏదో ఉన్నట్టు సందేహం రావడంతో, కాలి గోరుతో, తడిమి చూసింది. దాని గోరు తనకు గుచ్చుకుంటుందని ప్రతాప్, ప్రక్కకి జరిగాడు. కిందికి జారాడు. అతడు కొన్ని వేల అడుగుల నుండి క్రిందికి పడసాగాడు.

అంత ఎత్తునుండి క్రింద పడడంవల్ల ప్రతాప్‌కు కళ్ళు తిరగసాగాయి. గట్టిగా కళ్ళ

మూసుకున్నాడు. కొంతసేపటికి పొదమీద పడ్డాడు. అమృత గుళిక అతని కడుపులో వున్నందున అతనికి చిన్న గాయం కూడా తగలలేదు... కాని మూర్ఛపోయాడు.

కొంతసేపటికి కళ్ళు తెరిచిన ప్రతాప్, ఎదురుగా అందమైన, అడవి జాతి యువతి నిలబడి ఉండడం చూసి, పైకి లేచాడు.

"లేవకండి! విశ్రాంతి తీసుకోండి!" తియ్యని కంఠంతో ఆ యువతి అంది.

"ఎవరు నువ్వు? నేను చందన దీవికి వెళ్లాలి" అన్నాడు ప్రతాప్.

"నా పేరు నీలి. ఈ గూడెం నాయకుని కూతుర్ని. నువ్వు స్పృహతప్పి పడివుంటే కాపాడాను. చందన దీవి ఇక్కడ నుండి చాలా దూరం. మా నాన్న నీకు తప్పక సహాయం చేస్తాడు. రండి!" అంటూ ప్రతాపేను తనతో తీసుకుపోయింది.

నాయకునికి ప్రతాప్ అంతా వివరంగా చెప్పాడు. ఆయన చాలా మంచివాడు. అందువలన వారం రోజుల్లో అతన్ని చందన దీవికి పంపే ఏర్పాటు చేస్తానని మాట ఇచ్చాడు.

ఆ రాత్రికి వారిచ్చిన పండ్లు తిని, ప్రతాప్ చిన్న గుడిసెలో పడుకున్నాడు. కానీ అతనికి కంటి మీద కునుకు రాలేదు.

అతడు జయపాలుని గురించి ఆలోచించ సాగాడు.

ఎవరో పెద్దగా అరిచినట్టు వినబడడంతో



ఆలోచిస్తున్న ప్రతాప్ అదిరిపాటున లేచాడు. ఆ శబ్దం గుడిసె బయట నుండి వినవచ్చిందని తెలిసి, గబ గబా బయటకి పరుగెత్తాడు.

అంతా చిమ్మ చీకటిగా వుంది. బయట ఎవరూ కనబడలేదు. ప్రతాప్ కత్తి తీసుకుని, ముందుకు అడుగులు వేయసాగాడు. కొంత దూరంలో ఒక వ్యక్తి తోడేలుతో పోరాడుతున్నాడు.

అది గమనించిన ప్రతాప్, "అయ్యో! ఎవరినో తోడేలు చంపడానికి ప్రయత్నిస్తుంది.. వెంటనే వెళ్లి రక్షించాలి!" అని ఆ వైపుగా పరుగెత్తాడు.

అప్పటికే తోడేలు ఆ వ్యక్తి కాలుని గట్టిగా కొరికింది. అతను 'అయ్యో' అని పెద్దగా అరిచాడు. అతని గాయం నుండి రక్తం ధారలుగా కారసాగింది. అయినా, ఆ వ్యక్తి దానితో పోరాడటానికి ప్రయత్నిస్తున్నాడు.

ప్రతాప్ అతనికి దగ్గరగా వచ్చి చూడగా, ఆవ్యక్తి ఆ గూడెం నాయకుడని గ్రహించాడు. వెంటనే తన కత్తితో తోడేలు తలను నరికాడు.

కానీ నాయకుడు, క్రింద పడిపోయాడు. అంతలో గూడెంలోని వారు పరిగెత్తుకు వచ్చారు.

నీలి, తండ్రిమీద పడి పెద్ద పెట్టున ఏడ్వసాగింది. అతని శరీరం నల్లగా మారిపోసాగింది.

అది గమనించిన ప్రతాప్. "ఏమిటీ, మీ నాయకుని శరీరం, నల్లగా మారిపోయింది? వెంటనే ఆయన గాయానికి ఏదైనా కట్టండి?" అన్నాడు.

"లాభం లేదు. ఆయన్ని రక్షించలేము. ఇక ఆయన మనకి దక్కడు?" అన్నాడొకడు.

"ఏమిటి మీరు అంటున్నది? తోడేలు కొరికినంత మాత్రాన మనిషి చనిపోతాడా?" అనడిగాడు ప్రతాప్.

"అది మామూలు తోడేలు కాదు. విషపు కోరలు కలిగివుండే అంతుష్. అది కొరికితే, వెంటనే కుందేలు రక్తాన్ని ఆ గాయం మీద పోసి కట్టుకట్టాలి. అప్పుడే ఆయన బ్రతుకుతాడు. కానీ ఇక్కడ ఒక్క కుందేలు కూడా దొరకదు. ఇక్కడికి కొంత దూరంలో వున్న మా శత్రుగూడెం వారి వద్ద నాలుగు కుందేళ్లు వున్నాయి. కాని వారిని అడిగితే ఇవ్వరు. మాకూ వారికీ పగ!" అన్నది నీలి.

"అందుకోసం మీరు ఆయన చావుని కళ్లారా చూస్తారా? ఇది అన్యాయం. కుందేలు ఎక్కడుందో నాకు చెప్పండి! నేనే తీసుకు వస్తాను" అంటూ ప్రతాప్, ఒక వ్యక్తితో ముందుకు కదిలాడు.

ప్రతాప్‌తో వచ్చిన వ్యక్తి కొంతదూరం ముందుకి వెళ్లి ఆగి, "అదిగో ఆ మూల కనిపిస్తున్న గుడిసెలు మా శత్రువులవి. వారి వద్ద నుండి ఎలాగైనా కుందేల్ని తీసుకురా. జాగ్రత్త" అంటూ వెళ్లిపోయాడు.

ప్రతాప్ అటువైపు చూసాడు. వలయాకారంగా సుమారు ఇరవై గుడిసెలు వున్నాయి. 'వాటిలో ఏ గుడిసెలో కుందేలు వున్నదో వెతకాలి' అనుకుంటూ మెల్లగా అటు వైపు నడిచాడు.

ప్రతాప్ గుడిసెల వద్దకు వచ్చి ఆగి, ఏ గుడిసెలో కుందేలు వుంటుందా?- అని ఆలోచించసాగాడు.

అంతలో "గుర్ర్..ర్..ర్..ర్.." మన్న శబ్దం విని ఆశ్చర్యంతో చూసాడు. ఎదురుగా నాలుగు వేటకుక్కలు నిలబడి వున్నాయి.

అవి చాలా ఎత్తుగా బలిష్ఠంగా వున్నాయి. వాటి నాలుకలు దాదాపు అడుగుడున్నర మేర బయటకి వచ్చి, చొంగకారుతుంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. అవి మీద పడి కొరికాయంటే మాంసపు కండలు బయట పడవలసిందే.

ప్రతాప్ భయంతో రెండడుగులు వెనక్కి వేశాడు. కానీ నేను వెనక్కి తిరిగి పరిగెత్తినా, అవి వదలవు. పరిగెత్తుకు వచ్చి, పీక్కు వెంటాడుతాయి. అవి ఏమి తిని ఇంత బలిష్ఠంగా వున్నాయో! వీటిని చూస్తేనే కాళ్ళూ, చేతులు ఆడటం లేదు. వీటి బారి నుండి తప్పించుకోవడమెలాగో ఏమీ పాలుపోవడం లేదు. మెదడు మొద్దుబారిపోయినట్లుగా ఉంది ఇప్పుడేంటి మార్గం అనుకుంటూ చేతిని తన దుస్తుల మీద అలవాటుగా పెట్టుకున్నాడు. లోపలున్న శక్తివంతమైన బాకు చేతికి తగిలింది.

వెంటనే ప్రతాప్ బాకును బయటకు తీసి, కుక్కల మీద వదలాలనుకుని, బాకును గాలిలోకి ఆడించాడు.

మరుక్షణం ఆ వేటకుక్కలు, పిల్లుల వలె అతని చుట్టు తిరిగి, మెల్లగా వెనక్కి వెళ్ళిపోయాయి.

(ఇంకా వుంది)



# భారతంలో కొన్ని విశేషాలు

**వింటె** భారతం వినాలి! తింటె గారెలె తినాలి! ఇది పూర్వం నుండి వస్తున్న నానుడి. అందులో కొన్ని విశేషాలు ఇవి.

సభలో ద్రౌపది వస్త్రాపహరణం జరుగుతున్నప్పుడు ఏ ఒక్కరూ నోరెత్తలేదు! ఒక్క వికర్ణుడు తప్ప! వికర్ణుడు వస్త్రాపహరణాన్ని ఖండిస్తూ, సభనుండి నిష్క్రమిస్తాడు. వికర్ణుడు దుర్యోధనుని తొంభైతొమ్మిది మంది సోదరులలో ఒకడు.

యుద్ధం ప్రారంభానికి ముందు తన శిబిరంలో వారిని ప్రశ్నించి, తనకు ఎన్ని రోజులలో విజయాన్ని చేకూర్చ గలరని అడిగితే, భీష్ముడు మూడు రోజులలోనూ, ద్రోణుడు ఐదు రోజులలోనూ, కర్ణుడు 7 రోజులలోనూ అని చెబుతారు. ఇక్కడ పాండవ శిబిరంలో ధర్మరాజు అర్జునుణ్ణి అదే ప్రశ్న వేస్తాడు. దానికి అర్జునుడు ఒక్క క్షణంలో కౌరవులను నాశనం చేసి విజయం చేకూరుస్తానంటాడు. ఎలా? అన్న ధర్మరాజు ప్రశ్నకు అర్జునుడు, శివుడు ప్రసాదించిన పాశుపతాస్త్రాన్ని ప్రయోగిస్తే కౌరవసేన సర్వనాశనమవుతుందని, అయితే తాను అలా ప్రయోగించనిది ఎందుకంటే, అంతటి ప్రజలు చెదిరిపోతారంటాడు.

కాని అర్జునుడు పాశుపతాస్త్రాన్ని ఒక్కసారి అది కూడా నిర్దిష్ట లక్ష్యాన్ని ఛేదించడానికి అంటే సైంధవుడు తల తెగి తపస్సు చేస్తున్న తండ్రి చేతుల్లో పడేందుకు మాత్రమే ప్రయోగిస్తాడు.

ఉత్తరుని ప్రగల్భాలని వింటాం, కానీ అతడు అతిరథుడు, మంచి వీరుడు కూడా! కానీ గోగ్రహణ సమయంలో, భీష్మ, ద్రోణ, కర్ణాదులను ఒక్కసారిగా చూసి భయపడతాడు. కానీ భారత యుద్ధంలో శల్యునితో వీరోచితంగా పోరాడి మరణిస్తాడు.

యుద్ధ సమయానికి కౌరవ పాండవులందరూ, కృష్ణుడితో సహా 80-90 మధ్య దశకంలో వారే! అలాగని వారు వయసు మీరినవారు కారు. ఆ కాలానికి సగటు ఆయుర్దాయం 200 సంవత్సరాలు. కృష్ణుని వయస్సు యుద్ధ సమయానికి 84 సంవత్సరాలు. వీరందరూ మధ్యవయస్కులు. యుద్ధానంతరం కొన్ని సంవత్సరాల తర్వాత కృష్ణుడు కిరాతుని బాణ ప్రయోగంతో తనువు చాలిస్తాడు. తదుపరి జరిగిన అంతర్యుద్ధ పోరులో యాదవ నాయకులందరూ మరణిస్తారు. ధర్మజుని ఆజ్ఞప్రకారం యాదవ స్త్రీలను హస్తినాపురానికి తరలిస్తూ, మార్గ మధ్యంలో దోపిడీ దొంగల బారిన పడతారు. అర్జునుణ్ణి కొట్టి పడవేసి, ధన, కనక వస్తు వాహనాదులను దోచుకుపోతారు. ధర్మజుడు సోదరులతో కలిసి సన్యాసాశ్రమాన్ని స్వీకరించి హిమాలయాలకు పోతాడు.

-వెంట బాబూరావు, శ్రీకాకుళం



# దైవ సహాయం

రంగాపురంలో రాజయ్య అనే ఓ యువకు డుండేవాడు. వాడు ఉత్త అమాయకుడు. అలా అని వాడిని పూరి వారెవరూ మోసం చెయ్యరు.

రాజయ్య హనుమంతుని భక్తుడు. భక్తుల కేవయినా సమస్యలు, కష్టాలు కలిగితే, దేవుడు ఇట్టేవచ్చి సహాయం చేస్తాడని వాడికి నమ్మకం. అది వాడందరికీ చెప్పేవాడు.

కానీ, వాడి మాటలు విన్నవారంతా– "దేవుడు స్వయంగా రావడమేమిటి? నీమొహం?" అని వాణ్ని పిచ్చివాడి క్రింద జమకట్టేవారు.

అలా వుండగా ఓసారి రాజయ్య ఓ లాగుడు బండిపై సరుకులు వేసుకుని, సంతలో అమ్ముకు రావడానికి బయలుదేరాడు. బండి అలా వెళుతుండగా, బండి చక్రం ఒకటి అనుకోకుండా ఓ బురద గుంటలో కూరుకుపోయింది. బండిపై బరువైన సరుకులుండటంతో అది బురద గుంట నుండి పైకి రాలేకపోయింది ఎంత ప్రయత్నించినా.

రాజయ్యకు ఉన్నట్టుండి ఆంజనేయ స్వామి జ్ఞప్తికి వచ్చాడు. "అరెరే! మహాశక్తి వంతుడైన ఆంజనేయుని భక్తుని నేను. నేను పిలిస్తే ఆ స్వామి తప్పకుండా వచ్చి నాకు సహాయం చేస్తాడు. నేను అనవసరంగా కష్టపడి బండిని తోస్తున్నాను!" అని అనుకున్నాడు. తరువాత "జై ఆంజనేయం ప్రసన్నాంజనేయం నాకు సహాయం చేయ్. నా బండిని గుంటనుండి మిట్టకు తోయించు!" అన్నాడు.

చివరికి విసిగిపోయి రాజయ్య హనుమంతుణ్ణి తలచుకున్నాడు. కానీ, అనుకున్నట్లు వాడి ప్రయత్నం ఫలించలేదు. ఎంతసేపటికీ దేవుడు ప్రత్యక్షం కాకపోవడంతో విచారంతో బాట ప్రక్కన వున్న పచ్చికపై కూలబడ్డాడు.

టి. లలిత, ఖర్గపూర్

రాజయ్యనడిగి కారణం తెల్సుకుని, పక్కున నవ్వాడు.

రాజయ్య అసలే చిరాకుతో వున్నాడేమో! ఆ నడివయస్కుని వైపు కోపంగా చూసి, "ఎందుకలా నవ్వుతావ్?" అనడిగాడు.

అందుకా నడివయస్కుడు, లేకపోతే ఏమిటయ్యా నీ పిచ్చి! దేవుడు స్వయంగా వచ్చి నీకు సహాయం చేస్తాడా? ముందు మానవ ప్రయత్నం-తరువాత దైవసహాయం, అంతే! నీ ప్రయత్నం నీవు కొనసాగించు. అది జరగకపోతే, దేవుణ్ణి తలచు కుని, మరోసారి ప్రయత్నించు. అప్పుడు నిజంగా నీకు దేవుడు సహాయం చేస్తాడు!"

ఆ నడివయస్కుని మాటలలోని అంతరార్థాన్ని గ్రహించిన రాజయ్య వెంటనే లేచాడు.

ఆశ్చర్యం! అంతకుముందున్న ఆ పెద్ద మనిషి అక్కడలేడు, రాజయ్య విపరీతంగా ఆశ్చర్యపోయి, ఆలోచనల్లో మునిగి పోయాడు.

బాట ఎక్కడా మలుపులు తిరగలేదు. ఎవరూ పారిపోతూ కనిపించలేదు. పోనీ ఏ చెట్టుచాటున దాక్కున్నాడనుకున్నా ఆ చుట్టుపక్కల ఓ వృక్షమైనా లేదు.

తరువాత కొద్దిసేపటికి రాజయ్య ఆలోచన నుండి తేరుకుని, ఆ వచ్చిన పెద్దమనిషి ఆంజనేయ స్వామేనని, తన శక్తి తెలిపించడానికే ఇలా ఈ వేషంలో వచ్చాడనుకుని, స్వామిని మనసులోనే పరి పరి విధాలుగా ప్రార్థించి, లాగుడు బండి వద్దకు వెళ్ళి బండిని పట్టుకుని, శక్తినంతా కూడదీసుకుని, గట్టిగా లాగాడు. అంతే ఎవరో వెనుకనుండి తోస్తున్నట్లుగా బండిచక్రం ఈవల పడింది.

రాజయ్య తృప్తిగా నిట్టూర్చి, మరోసారి ఆంజనేయస్వామిని తలచుకుని, లాగుడు బండిని లాక్కుంటూ నూతనోత్సాహంతో సంతవైపు అడుగులు వేయసాగాడు.



# చీమల్ని తినే యాంటీటర్

జెయింట్ యాంటీటర్ అనే జంతువు పేరుకు తగ్గట్టే చీమల్ని తిని బ్రతికే జంతువు. దీని శరీరం ఎంత పొడవుగా ఉంటుందో దాని నాలుక అంతే పొడవుగా ఉంటుంది. దీని మూతి చివర సన్నటి గొట్టంలా వుంటుంది. దాంతో అది రోజుకు 35,000 చీమల్ని తింటుంది. బలంగా వుండే ముందరి కాళ్ళతో చీమల పుట్టల్ని తవ్వి మూతిని అందులో దూరుస్తుంది. పొడుగాటి దీని నాలుక మీద జిగురులాంటి పదార్థం వుంటుంది. చీమలు ఆ జిగురు వంటి పదార్థానికి అంటుకుంటాయి. అంతే! చీమలన్నీ దాని నోట్లోకి వెళ్ళిపోతాయి.

ఈ యాంటీటరు తన నాలుకని నిమిషానికి 150 సార్లు బయటకు తీసి లోపలికి లాగుకుంటుంది. అంటే ఒక నిమిషానికి ఎన్ని చీమలు తింటుందో లెక్కకట్టండి! మరి కుట్టే చీమలు వుంటాయి కదా? అవేం చేయవా! అని అనుమానమొస్తుంది. దీని వళ్ళంతా దట్టంగా బొచ్చువుంటుంది.. చీమల వల్ల దీనికి హాని లేదు. ఇంకో ప్రత్యేక విశేషం ఏమిటంటే దీనికి నోట్లో పళ్ళు వుండవు. నోట్లో వుండే బలమైన కండరాలలో చీమల్ని నలిపి తింటుంది.

చీమల్ని తినేటప్పుడే ఇసుక, గులకరాళ్ళు కూడా మింగుతుంది. ఈ ఇసుక గులకరాళ్ళ సహాయంతో కడుపులో చేరిన చీమల్ని పిండిలా చేసి అరిగించుకుంటుంది. 30 కిలోల బరువుంటుంది. అవసరమైతే చిరుత పులితో కూడా పోట్లాడగల ధైర్యశాలి ఈయాంటీటర్. ఎలుగుబంటిలా శత్రువుని వాటేసుకుని అందులో గుండ్రంగా వుండచుట్టుకుని పడుకుంటుంది. ఆడ ప్రాణి విడతకు ఒకే ఒక పిల్లను కంటుంది. పిల్ల పుట్టగానే తల్లి వీపుమీదకు ఎక్కి ఒక సంవత్సరం అక్కడే గడిపేస్తుంది. తరువాత దిగి స్వతంత్రంగా బ్రతుకుతుంది. ప్రస్తుతం ఈ యాంటీటర్లు కేవలం 5000 వరకే వున్నాయి.

- శ్రీమతి టి. లక్ష్మి, హైదరాబాద్

# తాయెత్తు మహిమ

పూర్వం దాదూదయాళ్ అనే పేరు గల సంత్ ఉండేవారు. జనం వారిని గౌరవంగా సంత్ దాదూజీ అనేవారు.

ఒకరోజు దాదూజీ వద్దకు ఒక ముస్లిం స్త్రీ వచ్చింది. నమస్కరించింది. పిదప, "అయ్యో! నా భర్త నన్ను లెక్క చెయ్యడంలేదు. దయచేసి నా భర్త నా వశంలో ఉండేరీతిగా ఒక తాయెత్తు ఇవ్వండి" అన్నది.

అందుకు దాదాజీ నవ్వి, "నా దగ్గర మంత్ర తంత్రాలు లేవు. దేవుడిపై విశ్వాసమే నా శక్తి" అన్నారు.

ఐనా ఆ స్త్రీ నమ్మలేదు. ఇక చేసేది లేక దాదాజీ ఒక చిన్న కాగితం మీద ఏదో రాసి మడచి ఇచ్చారు. దాన్ని విప్పకుండా వెళ్లి తాయెత్తులో పెట్టించ మన్నారు. మెడలో ధరించమన్నారు. అందులోని మంత్రం పనిచెయ్యడానికి గాను తన భర్తను గౌరవించగమన్నారు. సేవ చేయమన్నారు.

ఆ స్త్రీ ఇంటికి వెళ్ళి అలాగే చేసింది. భర్త ప్రేమ పొందింది. వారి జీవితం సుఖంగా సాగింది.

కొన్నాళ్లు పోయాక ఒకరోజు మాటల సందర్భంలో ఆ తాయెత్తు మహిమ గురించి చెప్పింది. ఆవిడ భర్త "ఆ తాయెత్తులో ఏముందో చూద్దాం" అన్నాడు. అందుకు ఆవిడ నిరాకరించింది. "ఇంత మహిమ గల తాయెత్తును మనం విప్పకూడదు. దాదూజీ దగ్గరికెళదాం. దక్షిణ సమర్పిద్దాం. వారే అదంతా చూసుకుంటారు" అన్నది.

ఒకరోజు ఆ భార్యా భర్తలు దాదూజీ దగ్గరికి వచ్చారు. నమస్కరించారు. దక్షిణ సమర్పించారు.

వాసాల వరస

తాయెత్తు మహిమ గురించి వివరించారు.

"అంటే తాయెత్తు పనిచేసిందా?" అనడిగారు దాదూజీ.

అందుకా ముస్లిం స్త్రీ "అవునండీ... అది మహత్తుగల తాయెత్తు కదా! దాని ప్రభావం వల్లే మావారు నా వశమయ్యారు... నిజానికి తాయెత్తు మొదట నేను మిమ్మల్నడిగినప్పుడు కుదరదన్నారు. మీవద్ద మంత్ర తంత్రాలు లేవన్నారు. దేవుణ్ణి నమ్మమన్నారు... కానీ మీ శక్తి మీద నాకు అపారమైన నమ్మకం ఉంది. అందుకే నేను పట్టుదలతో మీనుండి ఈ తాయెత్తు పొందగలిగాను. ఈ తాయెత్తు మీరు నాకు ఇచ్చేటప్పుడు చిన్న కాగితం మీద మంత్రాక్షరాలు వ్రాసి మడిచి ఇచ్చారు. దీన్ని నేను ఇప్పటికే విప్పి చదవలేదు. కానీ మావారు ఆ మంత్రాక్షరాలు చూడాలని కుతూహలపడు తున్నారు. అందుకే వారిని కూడా మీవద్దకు తీసుకు వచ్చాను. మీరే ఆ మంత్రాన్ని చదివి చెప్పాలి!" అంది వినయంగా.

అందుకు దాదూజీ నవ్వి ఆ తాయెత్తును తీసుకున్నారు. వారి ముందే విప్పారు. చదివారు. అందులో - 'సేవ, సాధన వల్లనే భగవంతుడు కూడా వశమైపోతాడు' అని వ్రాసి ఉంది. "ఇది మంత్రం కాదు. నీవు నీ భర్తను భగవంతునిపై విశ్వాసముంచి సేవ చేశావు. వారి మనసు, ప్రేమను గెలిచావు. దీనికంతటికీ మంత్రం కాదు విశ్వాసమే మూలకారణం కదా! అన్నారు దాదూజీ. ఆ భార్యాభర్తలు ఆశ్చర్యపోయారు. మీదట విశ్వాసం యొక్క గొప్ప తెలుసుకుని వెళ్లిపోయారు.

య్య, మెట్‌పల్లి





# మాటలు తేడా

- ఎ. గోపాల్, చిత్తూర్

మాచవరం గ్రామంలో పాపయ్య అనే ఓ పిసినారి ఉండేవాడు. ఆస్తిపాస్తులున్నప్పటికీ పొరుగూళ్ళు వెళ్ళి, వారిని, వీరిని యాచించి ధనం, ధాన్యం సేకరిస్తుండేవాడు.

ఓసారి పాపయ్య చీకట్లో ఇంటికి వస్తూ, దారిలో ఓ యింటి ముందున్న పాతరలో జారిపడ్డాడు. పైకి రాలేక "రక్షించండి, రక్షించండి!" అంటూ అరవసాగాడు.

అతని అరుపులు విన్న దారిన పోయేవారు వచ్చి "మీ చెయ్యి యిలా యివ్వండి, పైకి లాగుతాం!" అంటూ అడిగారు.

అయితే, పాపయ్య చేయి ఎవరికీ అందివ్వకుండా యింకా "రక్షించండి, రక్షించండి!" అని అరుస్తూనే ఉన్నాడు. కాసేపటికి పాతర చుట్టూ పెద్ద గుంపు తయారైంది.

ఇంతలో గుంపులోనుండి ఓ తెలివైన కుర్రాడు వచ్చి, "ఇదిగో! ఈ చేయి పుచ్చుకుని పైకి రండి!" అని చేయి అందించాడు. వెంటనే పాపయ్య లేడిపిల్లలా పైకి ఎగిరి బయట పడ్డాడు.

ఆశ్చర్యపోయిన జనం "ఘద్మారంగా ఉండే మేమెంత మందిమి అడిగినా బయటికి రాని వ్యక్తి, నీ మాట వినగానే నీ చెయ్యి పట్టుకుని పైకి వచ్చాడు. ఏమిటి ఇందులో రహస్యం?" అనడిగారు. వెంటనే ఆ కుర్రాడు "ఇందులో తేడా అంతా మీ మాటల్లోనే ఉంది. మీరంతా ఆయన చెయ్యి ఇవ్వమన్నారు, నేను నా చెయ్యి పుచ్చుకోమన్నాను. ఆయనకు ఎప్పుడూ పుచ్చుకునే పనేగాని, ఇవ్వడం తెలియదు. అదీ అసలు రహస్యం!" అన్నాడు. జనమంతా నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

### శ్రీ కాళరాత్రి ధ్యానము

ఏక వేణీ జపాకర్ణ
పూరా నగ్నాఖర స్థితా
లంబోష్ఠీ కర్ణికాకర్ణీ
తైల్యాభ్యక్త శరీరిణీ ।
వామ పాదోల్ల సల్లోహ
లతా కంట భూషణా
వర్ధ న్మూర్ధ ధ్వజా కృష్ణా
కాళ రాత్రి ర్భయం కరీ॥

అల్లిన వెంట్రుకలు జడగా, జపా కుసుమాలను చెవులందు ధరించి, దిగ మొలతో, గాడిద వాహనంపై, వ్రేలాడే కింది పెదవితో, ఎడమ పాదమున ఇనప కడియం భూషణంగా వ్రేలాడే చెవులతో, ముల్లువంటి నగలతో, నువ్వుల నూనె పూయబడ్డ శరీరంతో, కపాలమును ధ్వజముగా ధరించిన ఓ తల్లీ! నీ భీకర ఆకారంతో చెడును నాశనం చేసి నన్ను రక్షించు - శ్రీ కాళ రాత్రిదేవీ!

**10**

సోమసుందరుని చూడగానే తటాదక మూడు స్తనములు రెండుగా మారిపోయి, ఆమెలోని స్త్రీ సహజమైన సిగ్గు ముందుకు వచ్చింది. తనకు భర్త అతడే అని తెలిసి కొన్నది.

అప్పుడు శివుడు మీనాక్షియైన తటాదకతో, "దేవీ నీ రాజ్యానికి వెళ్ళు అక్కడికి నేను వచ్చి, నీ తండ్రి అంగీకారంతో నిన్ను పరిణయం మాడుతాను!" అన్నాడు.




శివుడు దేవగణాలతో మలయ ధ్వజుని కలిసికొని, తటాదకను వివాహమాడగోరు తున్నట్లు తెలిపాడు.

మలయధ్వజుడు అందుకు సమ్మతించి వివాహం జరిపించాడు.

తటాదక - సోమసుందరులకు 'ఉగ్ర



పాండ్యుడు అనే మహా సాహస వీరుడైన పుత్రుడు పుట్టాడు.

ఉగ్రపాండ్యుడు కాంతిమతి అనే రాకుమారిని పెళ్ళాడిన తర్వాత, నూరు యజ్ఞములు చేయ సంకల్పించాడు.

అసలా కోరిక అతనికి ఎందుకు కలిగిందంటే, అతనికి ఓ మహర్షి "నూరు యజ్ఞాలు చేసిన వారికి ఇంద్ర పదవి దక్కుతుంది!" అని చెప్పాడు. అప్పటి నుండి ఉగ్రపాండ్యునికి దురాశ పుట్టింది. వంద యజ్ఞాలను చేసి, ఇంద్ర పదవిని పొందాలన్న కోరికతో, యజ్ఞాలు చేయడం మొదలుపెట్టాడు.

ఆ సంగతి ముందు ఇంద్రునికి తెలియలేదు. అందువలన ఉగ్రపాండ్యుడు వరుసగా యజ్ఞములు చేయసాగాడు.

అది తెలిసిన అతని పెద్దలు ఉగ్రపాండ్యుని దీవించారు. దాంతో అతనికి ఇంకా బలం ఎక్కువైంది.

ఉగ్రపాండ్యుడు తొంభై తొమ్మిది యజ్ఞములను ఏ కష్టమూ లేకుండా పూర్తి చేశాడు. అప్పుడు ఆ సంగతి ఎలాగో ఇంద్రునికి తెలిసిపోయింది. ఇంతవరకు తను తెలుసుకోలేకపోయినందుకు చింతించాడు. ఉగ్ర పాండ్యుడు నూరవ యజ్ఞము పూర్తిగావించాడంటే, తన పదవికి ముప్పు కలుగవచ్చు-అన్న భయంతో వణికిపోసాగాడు. ఏలాగయినా ఉగ్రపాండ్యుడు చేయబోయే నూరవ యజ్ఞమును పూర్తి చేయనివ్వకుండా చేయాలని దీర్ఘాలోచన చేసి, సముద్రరాజు సహాయంతో, ఆ ఉగ్రపాండ్యుని యజ్ఞము ఆపవచ్చునని తలచాడు. వెంటనే సముద్రరాజు వద్దకు బయలుదేరాడు.

ఇంద్రుడు సముద్రుని చూసి మధురను ముంచి వేయమని కోరాడు.

సముద్రుడు మధురను ముంచి వేసేందుకు వచ్చి, సోమసుందరుడికి భయపడి వెనుకకు వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు వరుణుడితో మధురా నగరంపై వర్షం కురిపించవద్దని కోరాడు.

ఉగ్రపాండ్యుడు యీ విషయం తెలిసికొని పుష్కలావర్తములను మేఘములను బంధించాడు.

ఇంద్రుడు ఉగ్రపాండ్యుడితో యుద్ధానికి తలపడ్డాడు.

యుద్ధంలో ఉగ్రపాండ్యుడే గెలిచాడు. నూరు యజ్ఞములు చేసి ఇంద్ర పదవిని పొందాడు.

ధరణీ దక్షుల కుమారిత 'దితి'.

దితి కశ్యప మహామునిని పెళ్లి చేసుకుంది. దితి సవతులు అదితి, వినత, కద్రువ.

దితి కామోద్రేకంతో సంధ్యా కాలంలో భర్తను సమీపించి నందువలన, ఆమె పుత్రులు దుర్మార్గులు, క్రూరులుగా పుట్టారు. ఉగ్ర కర్ములైన భద్రుడు, హిరణ్యాక్షుడు, హిరణ్య కశిపుడు - మొదలైన వారు పరాక్రమ శాలులై ఇంద్రుని గజ గజ లాడించేవారు.

అందువల్లనే ఇంద్రుడు దితి సంతానాన్ని సంహరించసాగాడు.

దితి కోపంతో ఇంద్రుని చంపగల పరాక్రమ శాలియైన పుత్రుని కనాలని నిర్ణయించి, నిష్ఠగా పతి సేవ చేసింది.

ఆమె సేవకు మెచ్చిన కశ్యపుడు, "దితీ! నీకేం కావాలో కోరుకో!" అన్నాడు.

దితి ఆనందంతో "స్వామి! ఇంద్రుని సంహరించగల పుత్రుని నాకు అను గ్రహించండి!" అని వేడుకుంది.

అంతే! ఆ మాటలు విని కశ్యపుడు ఎంతో దుఃఖించాడు. ఇచ్చిన మాట తప్పలేక 'సరే' అన్నాడు.

దితి గర్భం దాల్చింది. ఆ గర్భంలోని శిశువు తనని చంపగలిగే మహాశక్తివంతుడు, అని తెలుసుకున్న ఇంద్రుడు భయపడిపోయి, ఆ శిశువుని గర్భంలోనే చంపవలెనని నిర్ణయించుకున్నాడు.

ఇంద్రుడు పదేళ్ళ బాలుడి రూపంలో దితి వద్దకు వచ్చి, "దాసుడిగా వుండి పని చర్యలు చేస్తాను. దయచేసి మీ సేవకుడుగా నన్ను ఆదరించండి!" అని వేడుకొన్నాడు.

దితి జాలితో ఒప్పుకుంది.

బాలుడి రూపంలోని ఇంద్రుడు సేవలు చేయసాగాడు. తనపై విశ్వాసం కలిగేలా నడుచుకొన్నాడు.

ఒకరోజు మధ్యాహ్నం దితి నిద్రించే



సమయంలో దితి గర్భాన్ని చీల్చి వేయాలను కొన్నాడు. కాని, అది మహా పాతకమని వెనుకాడి, గర్భంలోని శిశువును మాత్రం చిన్నాభిన్నం చేయాలనుకొని, గర్భంలోనికి ప్రవేశించి శిశువును ఏడు ముక్కలుగా చేసాడు.

ఆ ఏడు ముక్కలు బాధతో ఏడవటం చూసి ఇంద్రుడు ఒక్కో ముక్కను మళ్ళీ ఏడేసి ముక్కలుగా కోసి వేశాడు.

దితి గర్భంలోని ముక్కలన్నీ రోదించసాగాయి. ఇంద్రుడు వాటిని ఎలా నాశనం చేయాలో తెలియకున్నాడు.

దితి అదమరచి హాయిగా నిద్రపోవడం వలన, తన గర్భంలో శిశువు ముక్కలు అవుతున్న సంగతి తెలుసుకోలేదు.

శిశువు ముక్కలై పెద్దగా రోదించసాగాయి. ఆ శబ్దం వల్ల కదలిక ఏర్పడి దితి చాలా బాధపడసాగింది.

ఇంద్రుడు ఆ ఏడుపులను వినలేక రెండు చెవులను గట్టిగా మూసుకుని, దితి గర్భంలో నుండి వచ్చేయాలనుకున్నాడు.

గర్భంలోని శిశు రోదనం విన్న దితి మేల్కొంది.

ఇంద్రుడు గర్భంలో నుండి బైటకు వచ్చి దితిని ఓదారుస్తూ, "శత్రువును ఏ విధంగానైనా చంపవచ్చు. కాబట్టే వారిని ముక్కలుగా చేసాను. నన్ను క్షమించు!" అన్నాడు.

దితి గర్భంలో ఛిన్నాభిన్నమైన శిశువు మరుత్తులైన దేవతలుగా పుట్టారు.

దితి తన కుమారులను రక్షించు బాధ్యత ఇంద్రుడికే అప్పచెప్పింది.

ఇంద్రుడు ఎన్ని ముక్కలుగా చేసినా మరణించని మరుత్తులను దేవతలుగా గుర్తించి, వారిని తనతోపాటు తీసుకెళ్ళి పోయాడు.

(ఇంకా వుంది)



# పరిగణించదగిన పరిమాణాలు

1. సూర్యగోళం బరువు : $2 \times 10^{27}$ టన్నులు
2. భూగోళం బరువు : $6 \times 10^{21}$ టన్నులు
3. భూమి నీడ శంఖాకారంలో రోదసిలో 8,59,000 మైళ్ళ పొడవుంటుంది.
4. భూమి సూర్యుని చుట్టూ ఒక సంవత్సరంలో 96 కోట్ల కిలోమీటర్ల దూరం తిరిగి వస్తుంది.
5. "మానవుడు కాంతి వేగంతో ప్రయాణిస్తూ ఉంటే ఎప్పటికీ చనిపోడు" (ఐన్‌స్టీన్ థియరీ)
6. ఇప్పటికి సూర్యుడు పుట్టి 8 లక్షల కోట్ల సంవత్సరాలు అయింది. ఇంకా 15 లక్షల కోట్ల సంవత్సరాల నాటికి సూర్యుడుండడు. అప్పుడే భూమి నక్షత్రాల్లోకి దిక్కున ఎగిరిపోతుంది (న్యూటన్ థియరీ).
7. ఈ అనంత విశ్వం వ్యాసము 1008 కోట్ల, కోట్ల, కోట్ల మైళ్ళు. ఇట్టి బ్రహ్మాండం తన చుట్టూ తాను ఒక్కసారి తిరిగి వచ్చుటకు 30 వేల కోట్ల, కోట్ల, కోట్ల సంవత్సరాలు పడుతుంది.
8. గ్లాసెడు నీళ్ళ నీటి అణువుల గొలుసుతో భూమిని 20 కోట్ల చుట్లు చుట్టవచ్చును.
9. హైడ్రోజన్ పరమాణువు బరువు :-
   0.000,000,000,000,000,000,000,000,167 గ్రాములు
10. మనం వాక్యము చివర ఉంచే ఫుల్‌స్టాప్ (.) బరువు సుమారు :-
   0.0009922325 మిల్లీగ్రాములు.
11. మానవ శరీరంలో 1.000,000,000,000,000,000,000,000,000 అణువులున్నవి.
12. ఒక్క టీ స్పూన్‌లో పట్టగలిగిన న్యూట్రాన్ల పదార్థము 2 లక్షల ఏనుగుల బరువుంటుంది.
13. మన శరీరములోని భాగాల తరతమ బరువు : కండరములు - 42%, ఎముకలు - 16%, చర్మము - 7%, కొవ్వు - 19%, మెదడు - 2%, గుండె - 2%, కడుపు - 7%, రక్తము - 5%
14. నరములు గంటకు 200 మైళ్ళ వేగంతో సందేశాలను మెదడునకు తీసుకొని పోవును.
15. మన మెదడులో సుమారు ఒక లక్ష కోట్ల కణాలున్నవి.
16. మనిషి ఒక నిమిషానికి సుమారు 100 మాటలు మాట్లాడుతూ, 500ల మాటలు ఆలోచించగలడు.
17. పురుషుడు 4 సార్లు గాలి పీల్చే కాలంలో, స్త్రీ 3 సార్లు మాత్రమే గాలి పీలుస్తుంది.
18. ఒక సగటు మనిషి తల వెంట్రుకలన్నింటినీ, కలిపితే మొత్తం సుమారు 65 మైళ్ళ పొడవుండును.

సేకరణ : **మల్లాది నరసింహామూర్తి**, మల్కాజిగిరి, హైదరాబాద్



# అదృష్టం - దురదృష్టం

భీమయ్య వ్యవసాయం చేసుకొని తన భార్యా పిల్లలను పోషించుకునేవాడు. అతడు రోజంతా కష్టపడి పొలంలో పనిచేసేవాడు. దానయ్య వారి గ్రామానికి దగ్గరలో వున్న అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి, వాటిని గ్రామంలో అమ్ముకుని పొట్టపోసుకునేవాడు. భీమయ్య ఇంటి ప్రక్కనే దానయ్య గుడిసె కూడా ఉండేది.

ఒక రోజు అదృష్టదేవత, భీమయ్య కలలో కనిపించి "భీమయ్యా నీ యింటిలో నట్టింట త్రవ్వి చూడు నీ యిల్లు బంగారమవుతుంది." అని చెప్పింది. తెల్లవారి నిద్రలేచిన భీమయ్యకు రాత్రి వచ్చిన కల గురించి ఆలోచించి, అతని నట్టింటిలో త్రవ్వసాగాడు. త్రవ్వగా వచ్చిన మట్టిలో ఒక నీలి రంగు రాయి తప్ప, ఏ బంగారం, లేక ఏ విలువైన వస్తువులు దొరకలేదు. అతడు సాయంకాలం వరకు, కష్టపడి ఇల్లంతా త్రవ్వేసాడు. రెక్కలు ముక్కలైనవే తప్ప అతనికి ఏ విలువైన వజ్రవైఢూర్యాలు కనిపించలేదు. సాయంకాలానికి భీమయ్య అలసిపోయి, విసుగుచెంది, మట్టిలో దొరికిన రాయిని కోపంతో బయటికి విసిరివేసాడు. ఆపై కలలో కనిపించిన అదృష్ట దేవతని నానాతిట్లతో అర్చన చేశాడు. ఇహ ఎప్పుడూ కలల్ని నమ్మకూడదనుకున్నాడు. అనవసరంగా దేవత మాటలు నమ్మి నా యిల్లు బంగారమవుతుందనుకుని బంగారం లాంటి ఇంటిని నాశనం చేసుకున్నానంటూ వాపోయాడు.

రోజంతా కట్టెలు కొట్టి, వాటిని గ్రామంలో అమ్ముకొని, అలసి సొలసి, గొడ్డలి భుజాన వేసుకుని గుడిసెకు వస్తున్న దానయ్య తలకు

దొడ్డిపట్ల పూర్ణిమ, భీమవరం

భీమయ్య విసిరిన రాయి తగిలింది. దానయ్య తన భుజాన ఉన్న గొడ్డలిని నేలమీద పెట్టి, తనకు తగిలిన వస్తువు ఏమిటా అని, రాయిని తీసి చూడసాగాడు. అంతలో అతని చెయ్యి జారి, ఆ రాయి, ఇనుప గొడ్డలిపై పడింది. వెంటనే ఇనుప గొడ్డలి బంగారంగా మారిపోయింది. దానయ్య తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. తన తలపాగ తీసి, ఆ గుడ్డతో ఆ రాయిని, ఆ గొడ్డలిని కప్పి ఇల్లు చేరుకున్నాడు.

ఇల్లు చేరిన దానయ్య తన గుడిసెలో ఉన్న మరికొన్ని ఇనప వస్తువులకు, ఆ రాయిని తాకించాడు. ఇంకేముంది, తాకించిన ప్రతి ఇనుప వస్తువు, వెనువెంటనే బంగారంగా మారిపోయింది. ఆ రాయి "స్పర్శవేది" దానినే పరుసవేది అని అంటారు. ఆ రాయికి ఇనుమును బంగారంగా మార్చే శక్తి ఉంటుంది.

దానయ్య దశ తిరిగిపోయింది. మణుగుల కొద్దీ, ఇనుమును కొని, దాన్ని బంగారంగా మార్చి తన ఇల్లంతా బంగారంగా చేసేసాడు. భీమయ్య మాత్రం అలా పొలంలో పని చేసుకుంటూనే బ్రతుకుతున్నాడు. తనకు అదృష్టదేవత తన ఇల్లు బంగారమవుతుందని చెప్పింది.

కాని, తన ఇంటి ప్రక్కన గల దానయ్య గుడిసె బంగారంగా మారిపోయిందే దీనికి కారణమేమిటో అని అతను ఎంత ఆలోచించినా, సమాధానం దొరకలేదు అతనికి.

భీమయ్య అసహనం, అవివేకంతో తనకు లభించిన అదృష్టాన్ని చేజేతులా జారవిడుచుకున్నాడు. కాని దానయ్య సహనంతో తన తలకు తగిలిన వస్తువు ఏమిటా అని పరిశీలించి, వివేకంతో వ్యవహరించి అదృష్టవంతుడయ్యాడు.



# ప్రాణుల బ్రతుకు పోరాటం

మన జీవిత కాలం వంద సంవత్సరాలని అందరికీ తెలిసిందే! అయితే ఎన్నో కారణాల వల్ల అంతకాలం బ్రతికేవారు అరుదుగా కన్పిస్తుంటారు. 70 నుండి 80 సంవత్సరాల మధ్యకాలంలో మరణించే వారే అధికం. వంద సంవత్సరాల గడువు తీరి బ్రతికినవారూ అతి చిన్నకాలంలో మరణాన్ని ఆహ్వానించేవారు మనకు తారస పడతారు. మనిషి సంగతి ఇలా వుంటే మిగతా జీవుల ఆయుఃప్రమాణాలు మరింత ఆశ్చర్యకరంగా వుంటాయి. కొన్ని విశేషాలు చూద్దాం!

మనిషిలా వంద సంవత్సరాలు జీవించి ఉండే ప్రాణులు రాక్షస ఆల్చిప్ప (80-100), తాచుపాము (100 సం॥) తిమింగలం (70-100) మాత్రమే.

రాక్షస తాబేలు ఏకంగా 300 సంవత్సరాల వరకు బ్రతుకుతుందంటే ఆశ్చర్యం కలుగుతుంది. మామూలు తాబేలు 30 సం॥లు మాత్రమే బ్రతుకుతుంది. తూనీగ 2 నుండి 3 సంవత్సరాలు జీవిస్తుంది.

అడవికి రాజుగా పేరుపడ్డ సింహం బ్రతికేది కేవలం 30 సంవత్సరాలే! పెద్దపులి, ఎలుగుబంటి 40 నుండి 70 సంవత్సరాలు బ్రతుకుతాయి. ఒంటె, గుర్రం కూడా 30 సంవత్సరాలే జీవిస్తాయి.

పెంపుడు జంతువులైన కుక్క, పిల్లి, 12 నుండి 15 సంవత్సరాలు, ఆవు 26 సంవత్సరాలు, గాడిద 50 సంవత్సరాలు మనిషికి తోడుగా ఉంటాయి. పంది 20 సంవత్సరాలుంటుంది.

పక్షుల విషయం చూస్తే కాకి కలకాలం ఏమీ బ్రతుకదు. దాని వయసు 70 సంవత్సరాలు. ఆస్ట్రిచ్ పక్షి 40 నుండి 70 సంవత్సరాలు బ్రతుకుతున్నట్లు. గుడ్లగూబ '68' సంవత్సరాలు జీవిస్తుంది.

పది సంవత్సరాల లోపే తమ జీవిత కాలాన్ని పూర్తిచేసుకునే జంతువులెన్నో వున్నాయి. వానపాము (10 సం॥లు), కప్ప (3-5 సం॥లు), ఉడుత, ఎలుక, కుందేలు (10 సం॥లు), చిట్టెలుక (2-3 సం॥లు) వంటివి కొన్ని వున్నాయి.

చిలుకలలో కొన్ని రకాలు 140 సంవత్సరాలు వరకు దర్జాగా బ్రతికేస్తాయి.

– ప్రభాకరరావు, హైదరాబాదు



# అర్హత

మాళవదేశపు రాజ్య సరిహద్దుల్లో దట్టమైన అడవుల్లో ఆశ్రమం ఏర్పరచుకుని కొంతమంది శిష్యులతో అరణ్యాన్ని తపోభూమిగా మార్చుకున్నాడు గౌతముడు. ఆయన సకలశాస్త్ర కోవిదుడు. తపస్సంపన్నుడు. ఆ దేశపురాజు జయేంద్ర భూపాలుడు వేటకై వచ్చినప్పుడల్లా గౌతముని దర్శించుకుని ఆయన ఆశీస్సులు పొంది వెళ్తుండేవాడు.

ఒకసారి రాజు ఆశ్రమానికి వచ్చినప్పుడు "స్వామీ! తమ తదనంతరం ఈ ఆశ్రమాన్ని నిర్వహించడానికి అర్హత గల శిష్యుణ్ణి ఎంపిక చేశారా?" అని అడిగాడు.

దానికి గౌతముడు, "మహారాజా! ఇదిగో ఈ సంవర్తనుడే. నా తర్వాత నా ఆశ్రమాన్ని అన్ని విధాల చక్కగా నడిపించగల సమర్థుడు", అన్నాడు.

మహారాజు ఆ మునిపుంగవుని మాటలకు తలొగ్గి నమస్కరించి వెళ్ళిపోయాడు. ఆ మరునాడు గౌతముడు సంవర్తనుని పిలిచి, "నాయనా! సంవర్తనా! నీవు అనుభవ జ్ఞానము కొరకు పుణ్య తీర్థాలను దర్శించిరా" అని ఆశీర్వదించి పంపాడు. గురువుగారి ఆజ్ఞ శిరసా వహించి సంవర్తనుడు తీర్థయాత్రలకు బయలుదేరాడు. ముందుగా ఉజ్జయినీ నగరానికి మహాకాళేశ్వరుని దర్శించుకుని ఆ పూరిలోనే ఒక సత్రంలో పడుకున్నాడు.

కళ్ళు తెరచి చూసేసరికి తను ఒక హంస తూలికా తల్పంపై పడుకుని వుండడం గమనించి గుటుక్కున లేచి కూర్చున్నాడు. చుట్టూ చూశాడు. అదొక విశాలమైన భవనం! ముందర ఒక

యం. కళ్యాణి, చెన్నై



అందమైన నవ్వు వినిపించింది. ఘల్లు ఘల్లు మంటూ గజ్జెలు సవ్వడి వినిపించింది. కొద్ది క్షణాల తర్వాత అప్సరస లాంటి ఒక అందమైన అమ్మాయి అతని ముందుకు వచ్చి నిలబడింది. సంవర్తనునితో, "మునికుమారా! అంత భయపడతావెందుకు? నేను ఒక యక్షిణిని. నగర సంచారానికై వచ్చి సత్రంలో అరుబయట నిన్ను చూశాను. నీ ముగ్ధమోహన సుందర రూపం నన్నాకర్షించింది. నిన్నిక్కడికి తీసుకువచ్చాను. ఇది స్వర్గం. మనిద్దరం ఇక్కడ స్వేచ్ఛగా హాయిగా సుఖభోగాలనుభవించ వచ్చు." అన్నది.

సంవర్తనుడు కించిత్కూడా చలించకుండా ఆ యువతితో, "అమ్మా! నీవు నా మాతృ సమానవు. అపచారం తల్లీ, నన్ను వదిలెయ్" అంటూ వినయంగా చేతులు జోడించి నమస్కరిస్తూ నిలుచుని వున్నాడు.

ఆ యువతి చిరునవ్వుతో, "వత్సా! నీ బ్రహ్మచర్యాన్ని పరీక్షించడానికే నేనలా అన్నాను. నేను యక్షిణిని గాను. సాధారణ మానవ కాంతను. వేశ్యను. నీవు వెళ్ళవచ్చును" అన్నది.

సంవర్తనుడు అక్కడినుంచి నాసిక్ వెళ్ళి అక్కడ త్రియంబకేశ్వరుని దర్శించుకున్నాడు. రాత్రి ఒక సత్రంలో పడుకున్నాడు. తెల్లవారి చూసేసరికి అతని ప్రక్కన ఒక మూట కనిపించింది. ఆ చుట్టుప్రక్కల ఎవరూ లేరు. కొంత దూరంలో ఒక యాత్రికుల గుంపు కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుండడం చూసాడు. వారిని సమీపించి—

"అయ్యా! ఈ మూట తమరిలో ఎవరిదైనానా?" అని అడిగాడు.

వారందరూ "మాది ఎవ్వరిదీ కాదు" అన్నారు. సంవర్తనుడు ఆ ఊరి ధర్మాధికారి వద్దకి వెళ్ళి ఆ మూట నప్పగించాడు. ధర్మాధికారి ప్రజల ఎదుట ఆ మూటను విప్పిచూశాడు. దానిలో అత్యంత విలువైన వజ్రవైఢూర్యాలతో చేసిన బంగారు నగలున్నాయి. కళ్ళు జిగేల్మనే లాంటి అమూల్యమైన ఆ బంగారు నగలను మళ్ళీ మూట గట్టి ఈ నగలు గురించి ఎవరూ పోయినట్లు ఫిర్యాదు చేయలేదు. గాబట్టి అతనికే దొరికినందువలన సంవర్తనునే తీసుకోమని

గ్రామాధికారి చెప్పాడు.

సంవర్తనుడు అతనితో, "అయ్యా! నేనీ నగలు ఏంచేసుకోను? పరుల సొమ్ముపై నాకాశ లేదు. ఈ నగల నమ్మిన ధనంతో పేదసాదలకి ధర్మం చెయ్యండి. ప్రజలకి పదిమందికి ఉపయోగపడేలా వినియోగపరచండి. గ్రామాధికారి, ధర్మాధికారి తమరే కనుక తమరు దీనిని స్వీకరించండి. నాకు వద్దు" అని వినయంగా చెప్పి వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి ఆశ్చర్యానందాలతో అతనివైపే చూస్తుండిపోయాడు.

సంవర్తనుడు అక్కడి నుండి కాంచీపురం వెళ్ళాడు. అందులో కామాక్షి అమ్మవారిని, ఏకాంబరేశ్వరుణ్ణి శ్రీ వరదరాజ స్వామిని దర్శించుకుని కొంచెం దూరంలో వున్న ఒక మఠానికి వెళ్ళాడు. అది ఒక సన్యాసుల మఠం. జ్ఞానపీఠం వుంది. సంప్రదాయ ఆచార అనుష్ఠానాలతో సారంపర్యంగా వస్తున్న మఠం. మఠాధిపతి ఆకస్మికంగా పరమపదించుట వలన 'ఆ పీఠానికి అధిపతి ఎవరా' అని శిష్యకోటి తికమక పడుతున్నారు. తమలో ఎవరిని జ్ఞానపీఠాధిపతిగా అర్హులుగా నిర్ణయించాలో తోచక తికమక పడుతున్నారు. ఆ సమయంలో సంవర్తనుడు ఆ మఠంలోనే బస చేసి వున్నాడు. 10 రోజులు అక్కడ గడిపాడు అక్కడ వృద్ధులు, సిద్ధులూ అయిన పెద్దవారు యువ శిష్యులకు కొన్ని పరీక్షలు పెట్టారు. ఎవరూ చెప్పలేని అంత క్లిష్టమైన ఆధ్యాత్మిక ప్రశ్నలకు సంవర్తనుడు అతి సులువుగా తేలికగా చెప్పి జవాబు లిచ్చాడు. అతని మేధస్సు, పాండిత్యమూ, ప్రతిభ అందర్నీ ఆకర్షించాయి. అందరూ ఏకగ్రీవంగా సంవర్తనుణ్ణి తమ మఠంలో వుండి తమ పీఠాధిపతిగా పదవీ స్వీకారం చేయమని ప్రార్థించారు. కాని సంవర్తనుడు తను యింకా ఒక గురువుగారికి శిష్యుణ్ణేనని గురువుగారితోనే తీర్థయాత్రలు చేస్తున్నానని, తనకి ఎలాంటి పదవులూ, ఆధిపత్యాలూ వద్దని, చెప్పి వారి వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

సంవర్తనుడు తీర్థయాత్రలు ముగించుకొని తన వూరికి వస్తూవుండగా దారిలో అల్లరిమూక అయిన కొంతమంది ఆటవికులు అతనిపై బడి దాడి చేశారు. అతని జంధ్యం తెంచి పిలక పట్టుకు ఆడించి అల్లరి చెయ్యసాగారు. సంవర్తనుడు వారి చర్యలకు కొంచెం కూడా కోపగించుకోకుండా "నాయనలారా! మీకు వయసు పెరిగింది కాని, చిన్నతనం, చిలిపితనం పోలేదు. ఒక రాజు నన్ను బోధిస్తుంది కాలము. వయసు ఎగువ నుంచి దిగువకు ప్రవహించే జలపాతం లాంటిది. అది ప్రవాహ వేగంలా గడచిపోవటమే గాని తిరిగి వెనక్కి మళ్ళీ రాదు. మీరు ఈ వయసులోనైనా మంచి విషయాలు నేర్చుకుని మంచిపనులు చేసి పదిమంది చేత మంచివారనిపించుకోవాలి. వృథా కాలయాపన చేయక ఈ మానవ జన్మను సార్థకం చేసుకోండి. నాయనలారా" అని హితబోధ చేసాడు.

తనని అన్నివిధాల హింసలు పెట్టినా కొట్టినా

కూడ కోపగించుకోకుండా శాంతంతో సహనంతో తనుకి ప్రేమగా హితబోధ చేస్తున్న సంవర్తనుడు వాళ్లకి మామూలు మనిషిలా కాక సాక్షాత్తూ బుద్ధభగవానునిలా కనిపించాడు. చేష్టలుడిగి అచేతనులై అలాగే నిలుచుండి పోయారు.

సంవర్తనుడు మెల్లగా తనను విడిపించుకుని తన దారిన వెళ్లిపోయాడు. ఆఖరికి తన ఆశ్రమం చేరుకుని గురువును దర్శించాడు. తీర్థయాత్రలు ముగించుకుని వచ్చిన శిష్యుని ప్రేమాదరణతో ఆదరించి యాత్రావిశేషాలన్నీ అడిగి తెలుసు కున్నారు గురువుగారు. నాలుగు రోజుల తర్వాత ఆ ఆశ్రమానికి తన తర్వాత అనంతరవారుడుగా కార్యనిర్వాహకుడుగా ప్రకటిస్తూ ఒక సభ ఏర్పాటు చేసాడు. ఆ సభకి మాళవ దేశాధీశుడైన జయేంద్రభూపతి ముఖ్య అతిథిగా విచ్చేసాడు. జయేంద్రుడు గురువుగార్ని మరియు శిష్యగణాన్ని ఉద్దేశించి-

"గురువుగారు సంవర్తనుడికి ఏ కఠిన పరీక్ష పెట్టకుండానే అతనిని యోగ్యుడని నిర్ణయిస్తే ఏమో అనుకున్నాను. కానీ అతనికి నేను పెట్టిన అన్ని పరీక్షలలోనూ గెలిచి అరితేరాడు. అతను తీర్థ యాత్రకు వెళ్లే విషయం చారుల ద్వారా తెలుసుకుని, అతనికి తెలియకుండా అతన్ని అనుసరించి ప్రతీ ఊరిలోనూ ఒక్కొక్క పరీక్ష పెట్టాను. సంవర్తనుడు కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలకి ఏ మాత్రం లొంగక ఇంద్రియా తీతుడనిపించుకున్నాడు. కాంతా కనకములు, పదవులూ లభించినా ఆశపడలేదు. క్రూర స్వభావం కలిగిన మదాంధులైన ఆటవిక జాతిని సైతం తన ప్రేమ సహనాలతో మెప్పించి పరివర్తన కలిగించాడు. సంవర్తనుడే ఉత్తమ శిష్యుడు. వందనీయుడూను". అని అన్నారు.

తన శిష్యుని గొప్పతనం మహారాజు నోటితో వినడంతో గురువు గౌతముడు సంతోషంతో సంవర్తనుని భుజం తట్టాడు. సంవర్తనుడు తల వంచుకుని అణుకువతో చేతులు కట్టుకుని నిలుచున్నాడు. కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి.



# గ్వాలియర్ కోట

గ్వాలియర్ కోట మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని గ్వాలియర్ పట్టణంలో ఉంది. చారిత్రక ఆధారాల ప్రకారం ఇది ఎనిమిదో శతాబ్దానికి చెందిన కోటగా తెలుస్తోంది. కోటలోని ప్రధాన భాగాల్లో గుర్జారి మహల్, మాన్ మందిర్ ప్యాలెస్‌ను 15వ శతాబ్దంలో రాజా మాన్‌సింగ్ తోమర్ కట్టించారు. 342 అడుగుల ఎత్తైన కొండపై ప్రత్యేకంగా ఉంటుంది. ఈ కోటను ఇబ్రహీమ్‌లోడి, బాబర్, హుమాయూన్, అక్బర్ ఇలా పలువురు తమ అవసరార్థం వినియోగించుకున్నారు. 1023లో గజని ఈ కోటను ఆక్రమించారు. తర్వాత కుతుబుద్దీన్‌ఐబక్ 1211లో ఆక్రమించారు. అయితే ఖైదీగా శిక్ష అనుభవిస్తున్న కొంతమంది రాజకుటుంబీకులు ఈ కోటలో ఉండిపోవడం ప్రాధాన్యత కల్గిన అంశంగా చెబుతారు. వారిలో అక్బర్ సోదరుడు కమ్రాన్, ఔరంగజేబు సోదరుడు మురాద్ ఉన్నారు. ఇలా పలువురు అధికారం అనుభవించిన అనంతరం ఈ కోట 1844లో సింధియాల చేతికొచ్చింది. బ్రిటిషు పాలనను వ్యతిరేకించి వారి గుండెల్లో సింహస్వప్నంలా నిలిచిన వీరవనిత రాణి లక్ష్మీబాయి ప్రాణాలు ఇక్కడే విడిచారు.

1858 జూన్‌లో బ్రిటిష్ వారు ఈ కోటపై దాడి చేశారు. దాంతో లక్ష్మీబాయి తన సైన్యంతో బ్రిటిష్‌వారితో తలపడింది. ఆ సందర్భంగానే ఆమె ప్రాణాలు కోల్పోయింది. ఈ కోటలో చారిత్రక కట్టడాలెన్నో ఉన్నాయి. మ్యాన్ మందిర్ ప్యాలెస్, పురాతత్వశాఖ మ్యూజియం ఉన్న గుర్జారి మహల్, జహాంగీర్ మహల్, కరణ్ ప్యాలెస్, షాజహాన్ మహల్ లాంటి పలు భవనాలను ఇక్కడ చూడవచ్చు. ఈ కోట మూడు కిలోమీటర్ల విస్తీర్ణంలో ఉంటుంది. కోటకు ఉత్తర, దక్షిణ దిశల్లో ప్రవేశ ద్వారాలున్నాయి. ప్రధాన ద్వారాన్ని హాథీపూల్ అంటారు. ఇంకో ద్వారాన్ని బదల్‌గిర్ గేట్ అంటారు. ఈ కోటలో నీటిని నిల్వ చేయడానికి భారీ ట్యాంకులున్నాయి.

– సేకరణ : కె. పవన్‌ప్రసాద్, పార్వతీపురం



# పిచ్చివాళ్ళు

- యం. శ్రీనివాసరావు, విజయనగరం

'నిమ్మపండు రంగు ఎరుపట' అనే రాత శబరీపురం గ్రామం గోడలపై ప్రత్యక్షమయ్యింది.

అది తప్పని అందరికీ తెలిసినా మనస్సుని పీకుతున్న ఆ రాత గ్రామంలో అందరినీ మరోసారి నిమ్మపండు రంగుని చూసేలా, చేసింది.

దాని రంగు ఎరుపు కాదని నిర్ధారించుకున్న గ్రామస్తులు గోడలపై నున్న ఆ పిచ్చి రాతని చెరిపేసి మనసుని కుదుటపరచుకున్నారు.

తరువాతి రోజు మళ్ళీ ఆ రాత గోడలపై ప్రత్యక్షమవ్వడంతో తలలు పట్టుకున్నారు గ్రామస్తులు. తాము చేయాల్సిన దైనందిన కార్యక్రమాల్ని సైతం ఆపేసి, ఆ పిచ్చి రాత గూర్చే చర్చించుకోవడం మొదలుపెట్టారు.

ఒకవేళ కుంకుమలో ముంచిన, నిమ్మకాయ గురించిన రాతలా? అంటే అది మంత్రించిన నిమ్మకాయ గురించి రాతలా? అంటూ జుట్టు పీక్కున్నాడు.

గ్రామపెద్ద ఆజ్ఞ మేరకు ఆ రాతలు రాస్తున్న వ్యక్తిని పట్టితెచ్చి గ్రామ సభ ముందు హాజరుపర్చారు.

అతడో పిచ్చివాడని అందరికీ అర్ధమయ్యింది.

అతడిని హేళన చేస్తూ, రాళ్ళతో కొట్టేందుకు గ్రామస్తులు సిద్ధం కావడంతో, 'అతడు పిచ్చివాడు కాదు. నిమ్మపండు రంగు ఎరుపు కాదని తెలిసినా పనీపాటా మాని దానిగూర్చే పదేపదే చర్చించుకున్న మీరంతా పిచ్చివాళ్ళు' అని గ్రామపెద్ద మందలించడంతో పిచ్చిలోకం నుండి బయట పడ్డారు గ్రామపెద్దలు.

# రాగితో ఆరోగ్యం

రాగి పాత్రలో నీటిని రాత్రంతా నిల్వ ఉంచి ఉదయాన్నే తాగితే శ్వాససంబంధిత రోగాలు దరిచేరవు. సూక్ష్మజీవుల నాశనకారి రాగి. భారతీయులు, ఈజిప్షియన్లు, ఫ్రెంచి వారికి రాగిపాత్రలపైనే మక్కువ. పూజలో కూడా రాగి పాత్రయే శ్రేయస్కరం. ద్రాక్షసారాలో ఫంగస్‌ని చంపడానికి ఫ్రెంచివారు రాగినే వాడుతారు.

సూక్ష్మజీవులను నిరోధించే శక్తి స్టీలుకన్నా రాగికే ఎక్కువ అని శాస్త్రవేత్తల ఉవాచ. కాశీలో గంగానది నీటిని రాగి చెంబులో పోసి విక్రయిస్తారు.

- డి. సత్యమూర్తి, రాజమండ్రి




Edited & Published by B.V. Radhakrishna, No.61 (Old No. 29) West Mada Church Street, Royapuram, Chennai - 600 013. (25904415, 25904748, 25975108) Printed by B.R. Govindarajulu, B.Com. No.61 (Old No.29) West Mada Church Street, Royapuram, Chennai - 600 013

